# అందరికీ నమస్కరించి.....

భగవాన్ బాబావారి దివ్యాశీస్సుల ప్రభావంతో, పాఠకులు, రచయితలు ప్రకటనదారుల సహాయ సహకారములతో క్రమం తప్పకుండా యిప్పటి వరకు 72 సంచికలు అందించగలిగాను. రెండు పర్యాయములు ఉత్తమ మాస పత్రిక విశిష్ట అవార్డులను కూడా 'శ్రీవాణి' సంపాదించగలిగింది. మన రాష్ట్ర పరిధులను దాటి వివిధ రాష్ట్రములలో నున్న, మరి విదేశాలలో నున్న తెలుగు వారి వద్దకు కూడా చేరుకొని ప్రశంసల నందుకుంటున్నది. వారందరికీ నా కృతజ్ఞతాభివందనలు.

ఉత్తమ ఆశయ ఆదర్శములుగల పత్రికను నడపటం ప్రస్తుత పరిస్థితులలో బహుకష్టమే అయినప్పటికీ, ప్రత్యేకంగా ఉద్యోగులను నియమించకుండా, మా ఇంటిల్లిపాది శ్రమపడి దీక్షతో నడుపుతున్నాం. అయినప్పటికీ ప్రతి సంవత్సరం వేల రూపాయిలలో నష్టమును చవిచూడవలసి వస్తున్నది. సంవత్సరమున కొక పర్యాయం జన్మదిన ప్రత్యేక సంచికను ముద్రించి, సహృదయులనుండి ప్రకటనలు (Advertisements) సేకరించి ఆ నష్టమును పూర్తిస్తున్నాము. జనవరి 91లో 7వ జన్మదిన ప్రత్యేక సంచికను ముద్రిస్తున్నాము. అవకాశంగల పెద్దలు సహృదయంతో ప్రకటనలు పంపి 'శ్రీవాణి'ని ప్రోత్సహిస్తారని ఆశిస్తున్నాను. ఉదార స్వభావులైన పెద్దలు జీవిత చందా (రు 600/)తో పాటు తమ ఫోటోలనుకూడా పంపి 'శ్రీవాణి' చేస్తున్న సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక ప్రచారమునకు తోడ్పడమని మనవి చేస్తున్నాను

కొంతమంది పెద్దలు తమ చందాలను పంపలేదు. ఒకే పర్యాయం జీవిత చందానో, 4 సం. చందానో పంపుదామని అశ్రద్ధ చేసేవారు కొందరయితే, రు 42/లే కదా ఎప్పుడో ఒకప్పుడు పంపవచ్చులే మరి కొందరు — అశ్రద్ధ చేస్తున్నారు. ఎవరికి వారికి చిన్న మొత్తముగానే కనిపిస్తుందిగాని, అందరివీ కలిస్తే మాకు మాత్రం మోయలేని భారమవుతున్నది. ఈ వాస్తవమును ఎవరికి వారు గ్రహించి వెంటనే సహకారం అందించుతారని ఆశిస్తున్నాను.

ఉత్తమ పత్రికలు రావాలని, వాటి సర్క్యులేషన్ మరింత పెరగాలని ఉత్తమ ఆశయ ఆదర్శములుగల పెద్దలు భావిస్తూనే వుంటారు. అయితే అట్టి ఉత్తమ పత్రికలను నిలబెట్టటానికోసం తమ వంతు బాధ్యతను నిర్వర్తిస్తున్నారా? ఇది ఎవరికి వారు వేసుకోవలసిన ప్రశ్న. అయితే తమ వంతు కర్తవ్యాన్ని ఆచరణలో చూపించలేకపోవటం వలన ఉత్తమ పత్రికలను పెట్టటానికి ఎవరూ ముందుకు రావటంలేదు. పాఠకులనుండి రావలసిన స్థాయిలో సహకారం లభ్యం కాకపోవటం వలన నాలాంటి వారు చేతులు కాల్చుకుంటున్నారు. దీనిని ఆసరాగా తీసుకొని కొంతమంది స్వార్థపరులు ఎల్లో జర్నలిజం, సెక్స్, డిటెక్టివ్ సాహిత్యం, అర్థనగ్న దృశ్యాలుగల పత్రికలు నడుపుతూ సొమ్ము చేసుకుంటున్నారు. అవి సమాజాన్ని కలుషితం చేస్తున్నాయి. 'శ్రీవాణి' సర్క్యులేషన్ ఆరువేలకు చేరుకున్నది. 10 వేల దాకా పెరుగుతే 'శ్రీవాణి' తన కాళ్ళమీద తాను నుంచోగలుగుతుంది. ఈ వాస్తవ పరిస్థితులను సహృదయంతో, సదవగాహన చేసుకొని 'శ్రీవాణి' సర్క్యులేషన్ పెంచే ప్రయత్నంలో తమ వంతు కర్తవ్యాన్ని నిర్వర్తిస్తారని విశ్వసిస్తున్నాను.

"ప్రేమజ్యోతి" గ్రంథమును ప్రేమతో ఆశీర్వదించి, అనుగ్రహించి, నేను ముద్రించిన మూడు వేల కాపీలను శ్రీ సత్యసాయి బుక్ ట్రస్టు వారిని తీసుకోమని స్వామి ఆదేశించినారు. స్వామి జన్మదినోత్సవ సందర్భమున ఈ అనుగ్రహమును నాకు ప్రసాదించినందులకు బాబావారికి శతకోటి ప్రణామములు. ఈ శుభగడియ కోసం 2 సం.లు వేచి ఉన్నాను. కొంతమంది పెద్దలు 'ప్రేమజ్యోతి' కోసం నాకు ముందుగా డబ్బులు పంపారు. వారిలో చాలామందికి డబ్బు తిరిగి యిచ్చాను. బహు కొద్దిమందికి మాత్రమే నేను డబ్బు యివ్వాలి. అట్టి వారు నాకు లేఖ వ్రాసిన యెడల వారి డబ్బు వెంటనే తిరిగి పంపగలము. శ్రీవాణి చందాకు సర్దుబాటు చేయమంటే చేయబడుతుంది. 'ప్రేమజ్యోతి' పుస్తకములు మాత్రం నావద్ద లేవు. ప్రశాంతినిలయం బుక్ ట్రస్టువారికి వ్రాసి, డబ్బు పంపి తెప్పించుకో ప్రార్థన. ఈ అసౌకర్యమునకు మన్నించ ప్రార్థన

ఇట్లు

కొమరగిరి కృష్ణమోహనరావు

# బాబా సన్నిధి మన పెన్నిధి

ఎవరిని పలుకరించినా 'సాయిరామ్', ఎవరి చేతిలో చూచినా 'సాయిరామ్' చేతిలో భగవాన్ బాబా ఫోటోనో, స్వామి పుస్తకాన్నో పట్టుకొని 'సాయిరామ్'...'సాయిరామ్'...అంటూ పరవళ్ళు త్రొక్కుతున్న జనసందోహం. సముద్రపుకెరటాలు ఒకదాని వెంబడి ఒకటి ఏ విధంగా వచ్చి పడుతుంటాయో, అదే విధంగా భక్త జన సముద్రం పుట్టపర్తి పరిసరాలను ముంచివేసిందనటంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు. విభిన్న భాషలు, మతాలు, జాతులు, వివిధదేశాల ప్రజలు, ఒకరి భాష ఒకరికి తెలియదు.వారికి తెలిసిన భాష ఒక్కటే. అదే 'సాయిరామ్' అదే హృదయ భాష, అందరి అనుసంధాన భాష. ప్రతి నేత్రం అనుక్షణం ఎవరి కోసమో ఆతురతతో ఎదురుచూస్తూ నిరీక్షిస్తున్నదా అనిపిస్తుంది. దివ్య దర్శనం ఎప్పుడు, ఎక్కడా దొరుకుతుందా ! అని ఉత్కంఠతతో ఎదురు తెన్నులు చూచే అశేష ప్రజానీకం.

లక్షలాదిమంది భక్తులు అరమోడ్పు కన్నులతో నిరీక్షిస్తుండగా, నిశ్శబ్దమలయ మారుత తరంగాలు హాయిగా వీస్తుండగా, ఆకాశగంగ పరవళ్ళు త్రొక్కుతూ, శాంతివేదిక ప్రక్కన కొండపై అర్ధనిమీలిత నేత్రాలతో ధ్యాన నిమగ్నుడై వున్న శివునిపై వచ్చిపడుతున్న ఆహ్లాదకరమైన దృశ్యాన్ని చూస్తుండగా, సంజీవని పర్వతాన్ని గొని గగనమార్గాన పయనిస్తున్న 65 అ. ఎత్తుగల ఆంజనేయస్వామిని వీక్షించుచుండగా, మురళీగానం చేస్తూ ప్రక్కన నున్న కొండపై ప్రత్యక్షమైన గోపాలకృష్ణుని దివ్య మంగళ మనోహర రూపాన్ని చూస్తుండగా, తన దివ్యహస్తంతో లక్షలాది మంది భక్తులను దీవిస్తూ, ప్రక్కనే వున్న కొండపైకి దివినుండి దిగివచ్చిన కరుణామయు (ఏసుప్రభు)ని చూస్తూ తన్మయత్వం చెందుతుండగా, చేతిలో కాగడాను బూని భక్తులను తిలకించటానికి వచ్చి కొండపై నిలబడిన 'జొరాష్ట్రియన్'ను తిలకించుచుండగా; ఎవరికోసమైతే లక్షలాది హృదయాలు పరితపిస్తున్నాయో, ఎవరిని చూడటానికి లక్షలాది నేత్రాలు ఆతురత పడుతున్నాయో,ఎవరిని తమ ఆరాధ్యదైవంగా భావించి సుదూర ప్రాంతాలనుండి పుణ్యక్షేత్రమైన పుట్టపర్తికి తరలివచ్చారో, ఎవరి వాక్కును వినటం కోసం నిష్కల్మష, నిర్మల హృదయాలతో ఎదురుచూస్తున్నారో, ఆ శుభసమయంలో ఆ దివ్య మంగళ మనోహరరూపం శాంతివేదికపై ప్రత్యక్షమై 'దివ్యాత్మ స్వరూపులారా !' 'ప్రేమస్వరూపులారా !' అనిన అమృతపు పలుకులు మైకులలో వినపడటంలోనే, క్లోజ్‌డ్ సర్క్యూట్ టి. వి. లలో ఆ 'యుగావతారి'ని దర్శించగానే కరతాళధ్వనుల ఘోష మిన్నుముట్టటం పరిపాటి. ఆశ్చర్యకరం ! మరుక్షణంలోనే అంతా నిశ్శబ్దం ! బాబా ఏమి చెబుతారా? అని చెవులు నిక్కబొడుచుకొని, ఆతురతతో, ఆలకిస్తూ ఎవరి స్థానాల్లో వారు నిశ్శబ్దంగా కూర్చుంటారు.

ఇన్ని లక్షలమంది అసలు అక్కడ వున్నారా? అనే అనుమానం కూడా కల్గుతుంది. అదే అక్కడి విశేషం. స్వామి తెలుగులోనే ఉపన్యసిస్తారు. ఇంగ్లీషులోనికి తర్జుమా వుంటుంది. ఈ రెండు భాషలూ తెలియనివారే ఎక్కువ మంది అయినప్పటికీ, స్వామి మాట్లాడుతుంటే తలలూపుతారు. సందర్భోచితంగా చప్పట్లు కొడతారు. ప్రతి ఒక్కరూ స్వామి చెప్పినది అర్థమయినట్లుగా తలలాడిస్తారు. అదే స్వామి చెప్పే హృదయభాషయేమో ! పెదవులు మాట్లాడుతాయి. హృదయం మాత్రం మాట్లాడదు. స్వామి మాట్లాడే భాష కొందరికి వినిపిస్తుంది. ఆ భాష తెలియని వారికి స్వామి హృదయం తెలుస్తుంది. అందుకోసమనే "హృదయంలేని మాటలకన్నా, మాటలురాని హృదయమే మేలు" అన్నారు బాబా. నాగస్వరం ఊదుతుంటే నాగులు ఏ విధంగా తమ పడగలను విప్పి నాట్యం చేస్తుంటాయో, లౌకికభాష అర్థంకాని అశేష ప్రజానీకం స్వామి హృదయ భాషను అర్థం చేసుకొని తలలాడిస్తుంటారు అదే అక్కడి ప్రత్యేకత. అదే భగవాన్ బాబా దివ్యశక్తికి ప్రతీక. మూగబోయిన హృదయాలను మేలుకొలిపే దివ్యశక్తి సంపన్నుడు బాబా. బాబా సన్నిధి మన పెన్నిధి.

— కొమరగిరి



# నొప్పించకండి! ద్వేషించకండి! ప్రేమతత్వాన్ని పెంచుకోండి!




భారతదేశంబు అలరారుచుండె నెల్ల
కనగ జాతులు మతములు భాషలు వేర్వేరు
నిలిచిన తెగలును వృత్తులెన్ని యున్న
భారతదేశాన పుట్టుటే భాగ్యమనుచు
ఏకమాత్మయు జ్ఞానంబు అందజేసి
దివ్యజ్యోతిని వెలిగించు దేశమిదియే
బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రాదులం
ఏకగర్భ జాతులంచు కాంచరయ్యా
అన్నలు ద్విజులు శూద్రాదులు తమ్ములు
భావ ప్రేమ నింపుటే భావ్యమయ్యా
గుణముచే క్రియలచే తనదు వర్ణమెల్ల
గుణమున్న గ్రహియింప కుదురునయ్యా
ద్విజుడు దుర్గుణ పూర్ణుడగ శూద్రుడు కాడే
శూద్రుడే సద్గ్రహి బ్రాహ్మణుడు కాడే
పేరులకు తెగలకు భేదంబు కలదే
ఏకాత్మమే అన్నిట అభివృద్ధిగాంచి
కలసి విశాలమై ఐక్యంబు కాంచరయ్యా
అప్పుడే ఈ దేశమభివృద్ధి నందునయ్యా

దివ్యాత్మ స్వరూపులారా!

ప్రాచీన కాలమునుండి భారతీయుడు సత్యమునే ప్రత్యక్ష దైవంగా భావించి, రక్షించి, సేవించి దివ్యత్వాన్ని పొందుతూ వచ్చాడు. భారతీయులు సత్య వ్రతులు, ధర్మపరాయణులు. న్యాయమే వారి ఆటపట్టు. ఈనాడు సత్యధర్మములను విస్మరించడంచేత దేశ సమైక్యతనుగాని, జాతి సమష్టితనిగాని అందుకోలేక పోతున్నాము. తూర్పున బంగాళాఖాతం, పశ్చిమాన అరేబియా సముద్రం. ఈ రెండింటికీ దక్షిణ సంగమ స్థానమే హిందూ మహాసముద్రం. అట్లనే జీవ బ్రహ్మలయొక్క ఐక్య సాధనా సంపత్తి భారతదేశము. జీవబ్రహ్మ ఐక్యాను సంధానమునకు భారతదేశమే ఒక ఆటపట్టు. భారత్ అనగా కేవలం ఒక దేశమునకుగాని, ఒక వ్యక్తికిగాని, ఒక కాలమునకు గాని సంబంధించి

## శ్రీసత్యసాయిబాబా

నటువంటిది కాదు. అనేక పురాణములయందు వివిధ రీతుల భారతాన్ని ప్రకటించినప్పటికీ, ఇది కేవలం వారి వారి భ్రాంతులనే చెప్పవచ్చు. జడభరతుడు భారత దేశాన్ని పాలించినందున ఈ దేశానికి 'భారతము' అని పేరు వచ్చినదని కొన్ని పురాణములు చెప్ప వచ్చును. శకుంతలాదుష్యంతుల కుమారుడైన భరతుడు ఈ దేశమును పాలించడం చేతనే దీనికి 'భరతదేశమని' పేరు వచ్చినదని మరికొన్ని పురాణ ములు చెప్పవచ్చును. శ్రీరామచంద్రుని సోదరుడైన భరతుడు, రామపాదుకలకే పట్టాభిషేకం గావించి, పవిత్రమైన హృదయంతో పాలించడంచేతనే ఆ భరతుని నామమే ఈ దేశానికి వచ్చినదని మరికొన్ని పురాణ ములు చెప్పవచ్చును. అయితే ఈ 'భారత' శబ్దము ఏనాడు పుట్టినది? జడభరతునికి పూర్వమే ఈ 'భారత' [illegible]

( తరువాయి 25 వ పేజీలో )

శ్లో॥ దుర్గస్త్రికూటః, పరిఖా సముద్రః
రక్షాంసి యోధాః, ధనదాచ్చ విత్తం
శాస్త్రంచ యస్యోశనసా ప్రణీతం
సరావణో, దైవవశా ద్విపన్నః ॥

శరీరంలో జవసత్వాలున్నన్నాళ్ళు మనంత వాళ్ళెవరూ లేరనుకోటం సహజం. దానికి తోడు అధికారం, అంగరక్షకులు, పిలిస్తే పలికే పరివారకులు, ఎంత అనుభవించినా తరగని సంపద, ఇలా వుండవలసినవన్నీ వున్నప్పుడు ఇంకా చెప్పవలసిందేముంటుంది?

# అమృతవాణి

## కూచిభొట్ల చంద్రశేఖరశర్మ

అలాంటి అన్ని హంగులు వున్నవాళ్ళను చూసి వాళ్ళకేం అదృష్టవంతులు. సర్వ సంపదలతో తులతూగుతున్నారు. వాళ్ళకెలాంటి యిబ్బందులు, బాధలు లేవని అనుకుంటారు చూచేవాళ్ళు.

కాని అలాంటి వాళ్ళకు కూడా ఆపదలు తప్పవు. విపత్తులు రావటానికి బీద గొప్ప తారతమ్యం లేదు. ఎంతటి వారికైనా దైవనిర్ణయం తప్పదు. తప్పించుకోటం తరంగాదు. అదే ప్రాప్తకాలమంటే.

మనకు రామాయణ కథ బాగా తెలిసిందే కదా! అందులో ప్రతి నాయకుడైన రావణుడు సామాన్యుడు కాదు. అసాధ్యుడు కూడాను. ఎందుకంటే – అతని లంకారాజ్యం అన్ని విధాల కట్టుదిట్టంగా వుంది. ఆ లంకకు చేరటమే కష్టం. అతని దుర్గం చూడబోతే త్రికూట పర్వతం. అది అభేద్యం. శత్రువులు ఏదో విధంగా [illegible] అతని దుర్గానికి చుట్టూరా అగాధమైన సముద్రం వుంది. అది లంకా పట్టణానికి అగడ్తలాగా వ్యాపించి వుంది. లంకలో రావణుని సైన్యంలోనున్న యోధులందరూ రాక్షసులే. వాళ్ళ నెదుర్కోవటం కష్టం. ధనం విషయంలో రావణునికి కొదువనేది లేదు. కుబేరుణ్ణి కొట్టి తెచ్చిన ధనరాశులు [illegible] మూలుగుతున్నాయి. ఇక యితనికి సలహా

[illegible]లు, ఉపదేశాలు ఇచ్చే గురువుగారు చాలా గొప్పవాడు. శుక్రాచార్యులవారం

అందరికీ గురువుగారు. [illegible]

[illegible]

[illegible] గురువుగారి అండ [illegible]

రావణునికి [illegible] ప్రయత్నించినా శత్రువులెవ్వరూ రావణ రాజ్యం వైపు కన్నెత్తి చూడనైనా చూడలేరని అర్థమవుతోంది.

అయితే చివరికి ఏమైందో [illegible] తెలుసుగా? అంత [illegible] విధాల [illegible] న్నుడు అయిన రావణుని శ్రీరామ[illegible]

[illegible]

కాలమహిమ. దైవం కాలరూపంలో కలిసివస్తే ఎంతటి వారైనా ఏమీ చేయలేరు. [illegible] ఏదీ ఆగదు. అది గమనించి ప్రవర్తించటం బుద్ధిమంతుల లక్షణం. విర్రవీగి గర్వాంధులుగా ప్రవర్తించటం మూర్ఖుల లక్షణం.

పరీక్షిన్మహారాజు సముద్రంలో పెద్ద భవనం నిర్మించుకొని పరివారాన్ని రేయింబవళ్ళు కాపలాపెట్టినా మృత్యువు వాతపడక తప్పలేదు కదా!

కాలరూపంలో వున్న ఆ దైవానికి నమస్కారం.

# బహుముఖ ప్రజ్ఞాశాలి డాక్టర్ కట్టమంచి

జ్యోతిషశాస్త్రంపై ఈ రచయితకు ఇంకా నమ్మకం కుదరలేదుగాని, ఆంధ్ర దేశానికి చెందిన ముగ్గురు మహా వ్యక్తులను గురించి కీర్తిశేషులు "ఆంధ్ర రత్న" దుగ్గిరాల గోపాలకృష్ణయ్య చెప్పిన జోస్యం' అక్షరాల నిజమైనది.

సర్వతోముఖ ప్రతిభాశాలి, జ్యోతిష శాస్త్రంలో కూడా ప్రావీణ్యంగల శ్రీ గోపాల కృష్ణయ్య ఒకసారి ఇలా అన్నారు—

"ఆంధ్రులలో అద్వితీయమైన మేధావంతుడినే. కాని, అల్పాయుష్కుడను. నా తరనే శ్రీ రామలింగా రెడ్డికూడా ప్రతిభావంతుడే. కాని, అతనికి కుజ దోషం వుంది. వాక్ స్థానంలో బృహస్పతివున్నా, నెత్తిమీద శని వున్నాడు. అందువల్ల అతని జీవితం పెద్దగా రాణింపుకురాదు. మా కోవకు చెందిన డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ నవగ్రహ మాలిక గల యోగజాతకుడు. రాజపథాన్ని అందుకుంటాడు".

తాను స్వయంగా చెప్పినట్టుగానే శ్రీ గోపాలకృష్ణయ్య అర్ధాయుష్కుంతుడే. 41 సంవత్సరాలైనా నిండకుండానే కన్ను మూశాడు. మూడవ వ్యక్తి డాక్టర్ రాధాకృష్ణన్ అంతర్జాతీయ ప్రఖ్యాతినే పొందగలిగాడు.

కాగా, డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి మహా మేధా సంపన్నుడైనా, బహుముఖ ప్రజ్ఞాశాలి అయినా ఆయన మేధా సంపత్తికి, బహుముఖ ప్రజ్ఞా ప్రాభవాలకు తగిన అంతస్థును అందుకోలేకపోయారు. ఇది విధి విలాస మేనేమో!

శ్రీ రామలింగారెడ్డి కవి, విమర్శకుడు, రచయిత, మహావక్త, విద్యావేత్త, రాజనీతిజ్ఞుడు. అన్నింటిని మించి, ఆంధ్రులలో ఆయనవంటి చమత్కారి, వ్యంగ్య సంభాషణా చతురుడు "నభూతో నభవిష్యతి" అనిపిస్తుంది.

విజయవాడ "ఇంటలెక్చ్యుయల్ సహారా" అన్నది ఆయనే; బెజవాడను "బ్లేజ్ వాడ" (విపరీతమైన వేడిమిగల ప్రదేశం) అన్నది కూడా ఆయనే.

ఆయనకు గల సమయస్ఫూర్తి అద్భుతమైనది. తిరుగులేని "రిటార్ట్" ఇచ్చి, అవతలివారి నోరు మూయించడంలో ఆయనకు ఆయనే సాటి.

## తుర్లపాటి కుటుంబరావు

ఆయన ఛలోక్తులు, వ్యంగ్యోక్తులు తెలుగు సాహిత్యంలో, ప్రజాజీవితంలో శాశ్వతంగా నిలిచిపోయాయి. నిర్మొహమాటంగా ఆయన ఒక్కొక్కప్పుడు అన్న మాటలు కొందరికి మనస్సు నొప్పించి వుండవచ్చు.

ఒకసారి శ్రీరెడ్డి మద్రాసు మెడికల్ కాలేజీలో ప్రసంగిస్తున్నారు. ఆకస్మికంగా విద్యుత్ప్రసారం ఆగిపోయింది. అంతా చీకటి. వెంటనే శ్రీరెడ్డి తన ప్రసంగాన్ని ఆపి "నేను చీకట్లో మాట్లాడను. బ్రహ్మచారిని కదా!" అన్నారట. అందరు పక్కున నవ్వారు.

ఒకసారి శ్రీరామలింగారెడ్డి మద్రాసు అసెంబ్లీలో ప్రతిపక్షంలో వున్నప్పుడు పానగల్లు రాజా ముఖ్య మంత్రి. ఆయన మంత్రి వర్గంపై శ్రీ రెడ్డి విశ్వాస రాహిత్య తీర్మానం ప్రవేశపెట్టారు. అంతకు పూర్వం తనను ప్రశంసిస్తూ శ్రీరెడ్డి వ్రాసిన లేఖలను పానగల్లు రాజా ఆయనకు చూపించసాగారు. "బ్రిటన్‌లో ప్రేయసీ ప్రియులు తాము వ్రాసుకున్న ప్రేమలేఖలను విడిపోయేటప్పుడు బయటపెట్టుకో"రని శ్రీ రెడ్డి అనేసరికి పానగల్లు రాజా మరి మాట్లాడలేకపోయారు!

## శ్రీ గోపాలరెడ్డిపై ఛలోక్తి

ఆ రోజు ఏలూరు కళాశాల కొత్త భవనాలకు శంకుస్థాపన జరుగుతున్నది. శంకుస్థాపన చేస్తున్నవారు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి. సభాధ్యక్షులు కట్టమంచివారు.

"నేడు నేను వేసిన ఈ పునాదిరాయిని అలాగేవుంచి గోపాలరెడ్డి చెయ్యి దగ్ధహస్తమన్న పేరు తీసుకు రాకండి. భవన నిర్మాణం త్వరగా పూర్తిచేయం"డని శ్రీ గోపాలరెడ్డి అన్నారు. వెంటనే శ్రీ రామలింగారెడ్డి అందుకుని, "గోపాలరెడ్డిగారి హస్తం దగ్ధహస్తం ఎలా అవుతుంది? ఆయనది ధగధగాయమానహస్తం" అనేసరికి సభికులు సుదీర్ఘ హర్షధ్వానాలు చేశారు.

ఒకసారి నెల్లూరులో ఒక సభకు అధ్యక్షత వహించ డానికి శ్రీ కట్టమంచివారు వచ్చారు. ఆయనను ఘనంగా వూరేగింపుతో తీసుకుని వెళ్ళాలని ఆహ్వానసంఘంవారు ఒక ఏనుగును, బ్యాండు వాద్యాలను తీసుకువచ్చారు. అలాంటి ఊరేగింపులంటే శ్రీరామలింగారెడ్డికి యిష్టం లేదు. "ఊరేగించడానికి నేను పెండ్లికొడుకును కాను, ప్రేతాన్ని కా"దని ఆయన చమత్కరించారు!

ఒక్కొక్కప్పుడు అవతలివారు నొచ్చుకోకుండా వారికి మెత్తగా అంటించడం పుట్టుకనుంచి ఆయనకు వెన్నతోపెట్టిన విద్య. శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు ఆంధ్ర ప్రభుత్వ ఆస్థాన కవిగా నియమితులైనప్పుడు ఆయనకు విజయవాడలో సన్మానసభ ఏర్పాటు చేశారు. ఆ సభకు శ్రీ రామలింగారెడ్డి అధ్యక్షులు. ఆయన మాట్లాడుతుండగా, వయోవృద్ధులైన శ్రీ శాస్త్రి మాట మాటకు ఏదో వ్యాఖ్యానిస్తున్నారు. మరి, అంత పెద్ద వారిని మాట్లాడవద్దని అనడమెలా?

"శాస్త్రిగారికి జంట కవిత్వం అలవాటే గదా!" అని రామలింగారెడ్డి ఛలోక్తిగా అన్నారు. దానిలోని అంతరార్థాన్ని గ్రహించిన శాస్త్రిగారు ఆ తరువాత మరి వ్యాఖ్య చేయలేదు!

శ్రీ కల్లూరి సుబ్బారావు, శ్రీ రామలింగారెడ్డి సన్నిహిత మిత్రులు. ఇద్దరూ హాస్య ప్రియులే. ఇద్దరూ "జోక్స్"ను ఇతరులపైనే కాక తమపైన రాముకూడా వేసుకుని ఆనందించగల రసహృదయులు. "స్వరాజ్యం వచ్చినా మీ ఇంటి పేరు మార్చు కోరేమండీ సుబ్బారావు గారూ!" అని అనేసరికి రామలింగారెడ్డిగారి హాస్య చతురతకు సుబ్బారావుగారు కూడా నవ్వారట.

"సతీమణి" అనే పద ప్రయోగాన్ని కట్టమంచివారు నిరసించేవారు. ఫలానావారి సతీమణి అంటే "ఆయనకు ఎందరు సతులున్నారు, వారిలో ఈమె మణి కావడానికి?" అనేవారు. ప్రతి విషయాన్ని నిశితదృష్టితో పరిశీలించే ఆయన మౌలిక ఆలోచనా శక్తికి ఇది నిదర్శనం.

అలాగే "సోదర సోదరీమణులారా?" అన్న పద ప్రయోగాన్ని కూడా ఆయన అవహేళన చేసేవారు. 'అందరు ఒక గనిలోనివారే కదా! ఆడువారిని మణులనడం దేని'కని ఆయన ప్రశ్నించేవారు.

## పోర్టర్ : రిపోర్టర్

ఒకసారి శ్రీ రెడ్డి మద్రాసు స్టేషన్‌లో దిగినప్పుడు ఒక రిపోర్టర్ ఆయనను కలుసుకొనడానికి వచ్చాడు. "నాకు కావలసింది పోర్టరు కాని, రిపోర్టరు కాదు" అని శ్రీ రెడ్డి చమత్కరించారు.

ఇలా చెప్పుకుంటూపోతే, శ్రీ రెడ్డి ఛలోక్తులు, హాస్యోక్తులను ఎన్నింటినైనా పేర్కొనవచ్చు. ఇక ఆయన పుట్టు పూర్వోత్తరాలను తెలుసు కుందాము.

శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి చిత్తూరు జిల్లా కట్టమంచి గ్రామంలో 1880 డిశంబర్ 1వ తేదీన జన్మించారు. చిన్నప్పుడు భారత, భాగవత, రామాయణాది ప్రాచీన గ్రంథాలను క్షుణ్ణంగా చదువుకున్నారు. విద్యార్థిగా వుండగాకూడా శ్రీ రామలింగారెడ్డి ఉద్దండ పిండమే. చిన్ననాడే ఆయన ప్రతిభా విశేషాలు ఉపాధ్యాయుల ప్రశంసను చూరగొన్నాయి.

ఒకసారి ఉపాధ్యాయుడు ఇంగ్లీషులో ఒక వ్యాసం వ్రాసుకురమ్మని విద్యార్థులను ఆదేశించాడు. శ్రీ రామ

లింగారెడ్డి వంతు రాగానే ఆయన ఒక చిత్తు పుస్తకం తీసి గడగడా వ్యాసం చదవసాగాడు. ఎంతసేపు చదివినా, పేజీలు మాత్రం తిప్పడంలేదు అంటే శ్రీ రెడ్డి ఆశువుగా వ్యాసాన్ని అప్పజెబుతున్నాడన్నమాట. ఈ విషయాన్ని ఉపాధ్యాయుడు గ్రహించి, శ్రీ రామలింగారెడ్డి ప్రతిభకు ఆశ్చర్యంతోపాటు ఆనందాన్నికూడా ప్రకటించాడు.

అనేకమంది సాహిత్య వేత్తలు, చరిత్రకారులు, భావుకులు చిన్నప్పుడు గణితశాస్త్రం అంటే ఎలా భయపడేవారో శ్రీ రెడ్డికూడా అంతే. ఈ విషయంలో చర్చిల్, సరోజినినాయుడు ప్రభృతులవలెనే శ్రీ రెడ్డికి చిన్నప్పుడు లెక్కలలో మార్కులు వచ్చేవి కావు.

మద్రాసు క్రిస్టియన్ కాలేజీలో చదువుతున్నప్పుడు శ్రీ రెడ్డి "ముసలమ్మ మరణం" అనే కావ్యం వ్రాశారు. అప్పటికి ఆయన వయస్సు 19 సంవత్సరాలే. ఈ కావ్యానికి పోటీలో ఉత్తమ బహుమతి లభించింది. ప్రజాశ్రేయస్సు కోసం ఆత్మత్యాగం చేసిన ముసలమ్మ అనే యువతి వీరగాథ ఇది. విద్యార్థిగా వుండగానే "కళాపూర్ణోదయం"పై ఆయన వ్రాసిన విమర్శక వ్యాసం శ్రీ వేదం వెంకటార్యశాస్త్రి వంటి మహా పండితుల ప్రశంస పొందింది.

విద్యార్థిగా వుండగా కట్టమంచివారు ప్రదర్శించిన ప్రతిభా విశేషాలకు ఇండియా ప్రభుత్వం సయితం అలరి ఆయనకు సంవత్సరానికి రెండువందల పౌన్లు స్కాలర్‌షిప్పు యిచ్చింది. క్రిస్టియన్ కాలేజీలో బి.ఎ. డిగ్రీ తీసుకున్న తరువాత ఆయన కేంబ్రిడ్జిలో సెయింట్ జోన్స్ కాలేజీలో చేరాడు. అక్కడకూడా ఆయన ప్రజ్ఞా ప్రాభవాలు, వాగ్విభవం ఆంగ్లభాషా పాండితి పెద్దలను ఆకర్షించాయి. ఆయన కేంబ్రిడ్జి యూనివర్శిటీ లిటరరీ క్లబ్ కార్యదర్శిగా ఎన్నిక కావడం అక్కడ ఆయన సంపాదించిన పేరు ప్రతిష్ఠలకు నిదర్శనం. 1905లో బ్రిటన్‌లో జరిగిన పార్లమెంటు ఎన్నికలలో ఆయన లిబరల్ పార్టీ తరఫున సభలు ఏర్పాటుచేసి, దాదాపు నూరు సభలలో ఉపన్యసించారు. ఆయన ఉపన్యాసమంటే ఇంగ్లీషు శ్రోతలు చెవులు కోసుకునేవారట. ఆయన రాజకీయ విజ్ఞానం, వ్యక్తిత్వ వైశిష్ట్యం వారిని అలరించాయి. ఆయన బ్రిటన్‌లో పుట్టి వుంటే అత్యున్నత పదవిని అధిష్ఠించే వాడని అనుకునేవారట. అప్పట్లో ఆయన కేంబ్రిడ్జి యూనియన్ సొసైటీకి ఉపాధ్యక్షుడుగా కూడా ఎన్నికైనారు. అలాంటి గౌరవం అంతవరకు ఏ భారతీయునికి లభించలేదు.

శ్రీ రెడ్డికి బారిష్టరీ చదవాలని వుందిగాని గోపాలకృష్ణ గోఖలే సలహాపై ఆయన ఎమ్. ఏ. చదివాడు. ప్రథమ శ్రేణిలో ప్యాసయినాడు. అప్పట్లో ఆయనను ప్రఖ్యాత బ్రిటిష్ పార్లమెంటేరియన్, మహావక్త అయిన బర్క్‌తో పోల్చారంటే ఆ బ్రిటిష్ సమాజంలో ఆయన ఎలాంటి స్థానాన్ని సంపాదించాడో గ్రహించవచ్చు.

శ్రీ రెడ్డి ప్రతిభ ఆనాటి బరోడా మహారాజాను ఆకర్షించగా, ఆయన రెడ్డిని అమెరికాలో ఉన్నత విద్యాభ్యాసానికి పంపి, అక్కడ చదువును పూర్తి చేసుకుని ఇండియా తిరిగి వచ్చిన రెడ్డిని తమ బరోడా కాలేజిలో వైస్ ప్రిన్సిపాల్‌గా నియమించారు. ఆనాడు శ్రీ రెడ్డి వక్తృత్వ మాధుర్యాన్ని చవిచూడాలని శ్రీ కె. ఎమ్. మున్షీ తాను విద్యార్థి కాకపోయినా, కాలేజీకి వెళ్ళి ఆయన ఉపన్యాసాలను వినేవారు.

బరోడాలో వుండగానే శ్రీ రెడ్డి మైసూర్ ప్రభుత్వం ఆహ్వానంపై అక్కడికి వెళ్ళి విద్యా విధానాలపై మూడు ఉపన్యాసా లిచ్చేసరికి అలాంటి ప్రతిభావంతుడు సంస్థానంలో వుంటేనే చాలునని మైసూరు ప్రభుత్వం కట్టమంచి వారిని మైసూరు రాజా కళాశాలలో అధ్యాపకునిగా నియమించింది. మైసూర్ విద్యారంగంలో శ్రీ రెడ్డి అనేక ఉన్నత పదవులను నిర్వహించారు. ఆయన అక్కడ వుండగానే మైసూర్‌కు ప్రత్యేక విశ్వ విద్యాలయం ఏర్పడింది. మైసూర్‌లో పెక్కు పాఠశాలలు ఏర్పడ్డానికి, ప్రభుత్వాదాయంలో అధిక భాగం విద్య కింద వెచ్చించబడ్డానికి కట్టమంచివారే కారకులు. ఆయన పాఠశాలలోనికి హరిజనులను ప్రవేశపెట్టేసరికి

గగ్గోలు పుట్టింది. సనాతనులు రెడ్డిగారిపై మహారాజాతో ఫిర్యాదు చేశారు! "హరిజనులు మాత్రం నా ప్రజలు కారా!" అని మహారాజా ప్రత్యుత్తర మిచ్చేసరికి ఛాందసులు కిక్కురు మనలేదు. శ్రీరెడ్డి 1921 వరకు మైసూర్‌లో వున్నారు.

1911-1912 సంవత్సరాల మధ్య విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలివారి అభ్యర్థనపై ఆయన అర్థికశాస్త్రాన్ని రచించారు. ఇది తెలుగులో ప్రసిద్ధమైన గ్రంథం. దీనికి మద్రాసు విశ్వవిద్యాలయం బహుమతికూడా లభించింది.

శ్రీ కట్టమంచివారు "కవిత్వతత్వ విచారం" అన్న విమర్శక గ్రంథాన్ని రచించారు. ఈ గ్రంథంకూడా పండిత, విమర్శకుల ప్రశంసలు పొందింది.

శ్రీ రెడ్డి 1922లో మద్రాసు శాసనసభ్యులైనారు. గొప్ప పార్లమెంటేరియన్‌గా రాణించడానికి కావలసిన మేధాశక్తి, వాక్చమత్కృతి, విషయ పరిజ్ఞానం ఆయనకు కలవు. మద్రాసు అసెంబ్లీలో ఆయన ప్రతిపక్ష ఉపనాయకుడుగా వున్నారు. ఇది నిజంగా ఆశ్చర్యకరమే. అంతటి సమర్థుడు, మేధావి ఉపనాయకుడుగా మాత్రమే వుండడం విచారకరమే. జస్టిస్‌పార్టీ మంత్రివర్గంపై ఆయన విశ్వాసరాహిత్య తీర్మానం ప్రతిపాదించి చేసిన మహోపన్యాసం చారిత్రాత్మకమైనది.

ఆంధ్ర విశ్వవిద్యాలయ అవతరణకు శ్రీ కట్టమంచివారు ప్రధాన కారకులు, అయితే, ఆ విశ్వవిద్యాలయం తాను ఆకాంక్షించినరీతిగా లేనందున ఆయన ఆవేదన చెందారు. 1926లో ఆంధ్ర విశ్వవిద్యాలయం విజయవాడ కార్యస్థానంగా ఏర్పడగా, దానికి మొదటి వైస్-ఛాన్సలర్ శ్రీ రెడ్డి. ఆయన ధాటికి తట్టుకోలేక పానగల్లు రాజా ఆంధ్ర విశ్వవిద్యాలయాన్ని సృష్టించి, శ్రీ రెడ్డిని దానికి వైస్-ఛాన్సలర్ చేయించి, "ఆయనను వదిలించుకున్నా" రని ప్రతీతి. ఎది ఎలా వున్నా, అందువల్ల ఆంధ్రులకు మేలే కలిగింది. ఆంధ్ర విశ్వవిద్యాలయాన్ని శ్రీ రెడ్డి పెంచి పోషించారు. ఆ తర్వాత జాతీయోద్యమంలో బ్రిటిష్ ప్రభుత్వ దమననీతికి నిరసనగా ఆ దేశభక్తుడు తన వైస్-ఛాన్సలర్ పదవికి రాజీనామా చేశారు అంతకు పూర్వం ఆయన విశ్వవిద్యాలయ కార్యస్థానం విజయవాడ నుంచి విశాఖపట్నానికి మార్పించారు.

కాంగ్రెసు పట్ల, గాంధీజీ పట్ల శ్రీ రామలింగారెడ్డి అభిప్రాయాలలో స్వవచన వ్యాఘాతాలు కనిపిస్తాయి. ఒకసారి ఆయన కాంగ్రెసును, గాంధీజీని విపరీతంగా ప్రశంసించారు. అదే వ్యక్తి తాను నేషనల్ వార్ ఫ్రంట్ నాయకుడైన తర్వాతాయనను తీవ్రంగా విమర్శించారు.

ఇది నిజంగా దురదృష్టమే.

శ్రీ రామలింగారెడ్డి ఆంధ్ర యూనివర్శిటీ వైస్-ఛాన్సలర్ పదవికి రాజీనామా చేసిన తర్వాత కొంత కాలం చిత్తూరు జిల్లా బోర్డు అధ్యక్ష పదవిని నిర్వహించారు. ఆయన కాంగ్రెసులో చేరడానికి ఆంధ్ర కేసరి ప్రకాశం కారకుడు. అయితే, రామలింగారెడ్డి కాంగ్రెసులో ఎక్కువకాలం లేరు. ఆయన స్వతంత్రుడు. భావుకుడు. అలాంటి వ్యక్తి పార్టీలలో నిలవడం కష్టం.

పిమ్మట శ్రీ రెడ్డి 1936లో తిరిగి ఆంధ్ర యూనివర్శిటీ వైస్-ఛాన్సలర్ అయి, 1949 వరకు ఆ పదవిలో వుండి ఆ యూనివర్శిటీని తీర్చిదిద్దారు. దేశంలోని ఎక్కడెక్కడి పండితులను యూనివర్శిటీకి ఆహ్వానించి, అధ్యాపకులుగా నియమించారు. ఆంధ్ర యూనివర్శిటీ ఇప్పటి రూపంలో వుండడానికి ఆయనే ప్రధానకారకుడు. 1949లో శ్రీ రామలింగారెడ్డి మైసూర్ విశ్వవిద్యాలయ ప్రోఛాన్సలర్‌గా వెళ్లారు. ఆంధ్ర యూనివర్శిటీని తన సహచరుడు డాక్టర్ వి.ఎస్. కృష్ణకు అప్పగించారు.

డాక్టర్ రామలింగారెడ్డికి జాతి, మత, కుల విభేదాలు లేవు. ఆయన ఆంధ్ర యూనివర్శిటీలో వుండగా, కుల తత్వాన్ని దరిచేరనివ్వక, కేవలం ప్రతిభను, యోగ్యతనుబట్టి ఉద్యోగాలిచ్చారు.

( తరువాయి 21వ పేజీలో )

# నారద భక్తి సూత్రాలు



# భక్తి ఫల స్వరూపిణి



## 25 సూ. సా తు కర్మ జ్ఞాన యోగేభ్యోఽప్యధికతరా

కర్మ జ్ఞాన యోగాదులకంటె కూడా భక్తి అత్యధిక శ్రేష్ఠతరం.

ఈశ్వర సందర్శనానికి నాల్గు మార్గాలున్నాయి. ఆత్మానాత్మ వివేకంతో సంసారంలో పడకుండా బ్రహ్మ విచారముఖ్యమైన జ్ఞానమార్గం ఒకటి.

లోకోపకారానికి లేక తన వాంఛాపరితృప్తికై ఇహ పరాలకోసం పాటుపడే యజ్ఞయాగాదులతో కూడిన కర్మ మార్గం రెండోది.

ఇంద్రియ నిగ్రహంతో [illegible] ... నియమబద్ధమైన యోగమార్గం మూడోది.

ఆత్మనివేదనంతో శరణాగతి కోరి విశ్వాసంతో నామస్మరణ ద్వారా సులభ సాధ్యమైన భక్తి మార్గం నాల్గోది.

మొదటి మూడు మార్గాలలో అభ్యాసానికి కుల వయో లింగ భేదాలున్నాయి. అభ్యాసం, అనుష్ఠానం సరిగా లేకపోతే నియమ భంగం జరిగితే పతనమయ్యే ప్రమాదం [illegible] ఉంది.

కానీ భక్తి మార్గంలో అలాంటి భయం లేదు. కుల వయో లింగభేదం లేదు. అందరూ భక్తి మకరందం పానం చేయవచ్చు. తమ తమ శక్తి కొలది ఆచరించి అభ్యసించి తరించవచ్చు. వీరికి ఎల్లప్పుడూ భగవంతుని అభయ హస్తం రక్షగా ఉంటుంది.

భగవంతుడు ఇలా వివరించాడు—

" భక్తి నన్ను వశం చేసుకొన్నంతగా జ్ఞాన కర్మ స్వాధ్యాయ తప యోగాదులు నన్ను వశం చేసుకోలేక శ్రద్ధా యుక్తమైన భక్తికి వశుణ్ణి అయిపోతాను. నా భక్తి రసం చండాలురను కూడా పవిత్రులను చేస్తుంది. భక్తికి అఖండ శక్తి ఉంది ".

'శాంతిశ్రీ' జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి

నాహం వేదైర్న తపసా న దానేన న
చేజ్యయా
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం
యథా॥
భక్త్యా త్వనన్యయా శక్య ఇహమేవం
విధోఽర్జున
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుంచ
పరంతప

ఓ అర్జునా! నీవు భక్తితో నన్ను దర్శించినట్లుగా వేద తపదాన యజ్ఞ విధుల నన్ను దర్శించజాలరు అనన్య భక్తి ద్వారా మాత్రమే ఇలాంటి నా సాక్షాత్కారం, ప్రేమ, నన్ను పొందే భాగ్యం, లభ్యమవుతాయి"

జ్ఞానయోగాదులచే శ్రమించటం ఎందుకు? భక్తితో సులభంగా భగవద్దర్శనం కల్గుతుంది కదా!

ఇంటిలో ఉన్న కామధేనువును వదలి పాలకోసం పొరుగింట్లకు పరుగెత్తినట్లుంది.

గరుత్మంతుడు హరి భక్తితో ఎన్ని పనులు సాధించాడు! కాన ఆ వైనతేయునివలె భగవంతుని సులభంగా సేవించండి. భక్తి అనే నౌకలో కూర్చుని సారహీనమైన సంసార సాగరాన్ని దాటిపొండి.

శుకుడు పరీక్షిత్తుతో ఇలా అన్నాడు—

విను మంభోజభవుండు మున్ను మదిలో
వేదంబుముమ్మారు నె
మ్మనమందున్ దలపోసి యెంతయు పరామర్శించి
మోక్షంబు త
క్కిన మార్గంబులవెంట లేదనుచు భక్తింజింత
సేసెన్ ఇనా
ర్దను నాత్మాకృతి నిర్వికారుడగుచున్ ఏన్మార్గ
నిర్ణేతయై

## 26. సూ. ఫల రూపత్వాత్

భక్తి ఫలరూపిణి, ఫలప్రదాయిని.

ఈ భక్తి తత్వంలో పరాకాష్ఠ దశ సాధ్య భక్తి అంటారు. దీనికే పరమ భక్తి అనీ, అనన్య భక్తి అనీ కూడా పేర్లు. ఈ సాధ్య భక్తిని చేరటానికి సాధనా రూపమైనవి గౌణీ భక్తులు. వీనికే సాధనా భక్తి పద్ధతులు అనికూడా పేర్లు.

సాధ్య భక్తి చేరటానికి ధర్మకర్మాలు, యజ్ఞ యాగాలు, వేదాధ్యయనాలు, నియమనిష్ఠలు సాధనలు. అనగా ఇవి గౌణీభక్తి విధానాలు అని అర్థం. ఈ గౌణీ భక్తి విధానాలద్వారా సాధ్యభక్తిని చేరుకోవాలి.

అనంత ప్రేమ రూపమగు భక్తియే పరమ ప్రయోజనం. ఇదే సర్వార్థ సాధకం. ఇదే సాధ్యభక్తి. ఇదే పరమానందం. ఇది సర్వ భక్తులకు సకల మునిజనులకు ధ్యేయం. దీనిని పొందుటే అందరి పరమావధి.

ఈ భక్తి ఒక మహాదేవి. ఈ దేవిని సర్వసిద్ధులూ నానావిధాలైన భోగాలూ పరిచారికలవలె నిత్యం సేవిస్తుంటాయి. ఈ దేవి ఫలరూపిణి. సకల ఫలదాయిని.

హరి భక్తి మహా దేవ్యాః సర్వాముక్త్యాది
సిద్ధయః
భుక్తయశ్చాద్భుతా స్తస్యా శ్చేటికా
వదనువ్రతాః

ఈ దేవి ఆదిశక్తి. చిత్కళా శక్తి. అందరి దేవతల కంటె అధి దేవత. సృష్టి స్థితి లయాలు ఆమె అధీనాలు. బ్రహ్మ ఈ తల్లి పాదరేణు సంపాదనా శక్తితో లోకాన్ని సృష్టిస్తున్నాడు. విష్ణువు ఒక్క పరాగరేణువును తన వేయి శిరాలపై మహాభాగ్యంగా మోస్తుంటాడు. శివుడు మహానందంగా ఒడలంతా పూసుకుంటాడు. ఆ పరాగ మహిమ అంత గొప్పది. ఆ తల్లిని వేవిధాల కీర్తించారు శంకర భగవత్పాదులు. ఆమె స్త్రీపురుష ఉభయరూపిణి. ఆ తల్లియే సౌందర్య లహరి. ఈమె అమ్మలగన్న అమ్మ ముగ్గురమ్మల మూలపుటమ్మ. ఈ తల్లిని పోతన యిలా ప్రస్తుతిం

అమ్మల గన్న యమ్మ - ముగురమ్మల
మూలపుటమ్మ - చాల పె
ద్దమ్మ - సురారులమ్మ కడుపారడి
బుచ్చినయమ్మ - తన్నులో
నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడి
యమ్మ - దుర్గ - మా
యమ్మ - కృపాబ్ధి - ఇచ్చుత మహత్వ కవిత్వ
పటుత్వ సంపదల్

శ్రీ త్యాగరాజు తన కృతులలో ఈ భక్తి దేవిని అన్నిటికి మూలం అన్నాడు -

సంగీత జ్ఞానము భక్తి వినా
సన్మార్గము గలదే మనసా !
స్వర రాగ సుధారస యుత భక్తి
స్వర్గాపవర్గము రా! ఓ మనసా! *

---

Do noble deeds, nor dream them
All day long

సాధించుము
ఘన కార్యముల్
పగటి కలలు మాని

- జంగా గోపాల్

# కొమరగిరి కారాగార లేఖలు

(గత సంచిక తరువాయి)

సెంట్రల్ జైలు, రాజమండ్రి
ది 21-4-1978

ఇంతకు పూర్వం ఉత్తరాలలో శ్రీరాముని, సీతను, హనుమంతుని గురించి వ్రాసాను. శ్రీరామునికి బహిః ప్రాణమైన లక్ష్మణుని గురించి ప్రస్తావించటం అత్యవసరం గదా! అతని భాతృభక్తి వర్ణనాతీతము. లక్ష్మణుడు మహావీరుడే కాదు, మహాత్యాగి కూడాను. అనుశాసన ప్రియుడు, జితేంద్రియుడు, పర స్త్రీలను మాతృభావంతో చూడగల పరమోత్కృష్టమైన ఉత్తమ శీలసంపన్నుడు. [illegible] రాజ [illegible]లను కోరుకుంటా, [illegible] సమస్తమును శ్రీరామ చంద్రునికి సమర్పించిన మహాత్యాగి. శ్రీరాముని సేవించుటకు, తన సర్వసుఖాలన్నింటిని తృణప్రాయంగా పరిత్యజించిన త్యాగశీలి. శ్రీరాముడు అరణ్యవాసానికి బయలుదేరేటప్పుడు లక్ష్మణుడు కూడా బయలుదేరు తాడు. రాముడు ఎన్ని వారించినా, లక్ష్మణుడు అంగీక రించడు. "నీవు లేనటువంటి త్రిలోకైశ్వర్యము నిచ్చి నను నేను దానిని కోరను" అని స్పష్టంగా చెప్పి శ్రీరాముని వెంబడిస్తాడు. అరణ్యవాసంలో శ్రీరాము నితో సకల కష్టాలను అనుభవిస్తాడు. తండ్రి వాగ్దానాన్ని నిలబెట్టటాని కోసము శ్రీరాముడు అడవులకు వెళ్లితే, సకల భోగభాగ్యములను స్వయంగా త్యజించి శ్రీరాముని అనుసరించటంలోనే వున్నది లక్ష్మణుని త్యాగనిరతి. అంతేకాదు వనవాసానంతరం, రావణ సంహారం జరిగినతరువాత, అయోధ్యకు వెళ్ళి శ్రీరాముడు పట్టాభిషిక్తుడైన తరువాత, యువ రాజ్యాభిషేకము పొందవలసిందని లక్ష్మణుని ఆహ్వానిస్తాడు శ్రీరాముడు. కాని ఎంత బలవంతం చేసినా అంగీకరించడు. అతని జీవితమంతయును త్యాగమయము. అధికారవ్యామోహం లేని నిస్వార్థ త్యాగపురుషుడు. తన కర్తవ్యముపట్ల మిక్కిలి కఠోరుడు. శ్రీరామచంద్రుని పట్ల అతనికి గల ప్రేమ వర్ణనాతీతం. 'కబంధుడు' అను రాక్షసుడు రామలక్ష్మణులను బంధించినప్పుడు, లక్ష్మణుడు సమయస్ఫూర్తితో కర్తవ్యాన్ని ప్రబోధిస్తాడు. "ఓ రామా! నన్ను గూర్చి ఆలోచింపకుము. నన్ను ఈ కబంధునికి బలిగా సర్పించి నీవు సుఖముగా పో! కొద్ది కాలంలోనే నీకు తప్పకుండా 'వైదేహి' లభ్యమవు తుంది. వనవాసమును పూర్తిచేసుకొని తిరిగి అయోధ్యకు వెళ్ళి సుఖముగా రాజ్యమును పాలింపుము" అని రాముని వేడుకుంటాడు. తన అన్న కొరకు తన శరీరమును సయితం బలి చేయటానికి ఏ మాత్రం వెరువని త్యాగ జీవి. త్యాగానికి మరొక పేరు లక్ష్మణుడు అనిన ఏ మాత్రం అతిశయోక్తి రాదు. సీతారాముల వివాహ మయిన తరువాత 12 సం.లు. అయోధ్యలో, 13సం లు అరణ్యములో వారికి సహచరునిగా నున్ననూ, సీత యొక్క మోమును కూడా లక్ష్మణుడు చూచి ఎరుగడు. సీతాదేవి విడచిన నగలమూటను, సుగ్రీవుడు ఋష్య మూక పర్వతము మీద శ్రీరామునికి చూపగా, వాటిని లక్ష్మణునికి చూపించి "మీ వదినవేనా? చూడు!" అని అడిగినప్పుడు...

" నాహం జానామి కేయూరే
నాహం జానామి కుండలే
నూపురే త్వభి జానామి
నిత్యం పాదాభి వందనాత్ "

## చైతన్యవాణి

* ప్రేమతో కారుణ్యంతో మేళవింపబడిన స్వార్థ రహిత చింతన, విశాల దృక్పథం ఆధ్యాత్మిక జీవనానికి బంగారు బాటను నిర్మిస్తాయి.
* మనస్సులోని విషయ వాసనలే వాస్తవ క్లేశములు. మానవుని సదా శోకాగ్నికి ఆహుతి చేసే విషసర్పాలు.
* మనస్సునకు జ్ఞానము అందదు. మనస్సుకు చిక్కేది వస్తుజ్ఞానమేకాని ఆత్మజ్ఞానము కాదు. మనస్సు ఆత్మజ్ఞానమునందు లయించిపోవుటయే జ్ఞానస్థితి. ఈశ్వరార్పణ బుద్ధితో ఆచరించిన నిష్కామ్య కర్మలు మనస్సును శుద్ధిచేసి ముక్తి సాధకమగును.
* విధేయత వ్యక్తి జీవితానికి ధన్యతను చేకూరుస్తుంది. జీవితాన్ని సార్థకం చేస్తుంది. నమ్రత భగవత్ప్రసాదము. అది వ్యక్తిత్వాన్ని ద్విగుణీకృతం చేస్తుంది. జ్ఞానపూరితం చేస్తుంది.

—సేకరణ : ములాపి సూరిబాబు

అనగా ప్రతి నిత్యం నేను పాదములకే నమస్కరించటం వలన, ఆమె పాదములపై గల అందెలను మాత్రమే ఎరుగుదును. మిగతా శరీరంమీద నున్న నగలు నాకు తెలియదంటాడు. లక్ష్మణునియొక్క నిర్మల చరిత్రకు యిది ఒక మచ్చుతునక. వదినగారి యెడల అతని హృదయమందు గల మాతృభక్తికి ఈ ఉదంతం ఒక నిదర్శనం. లక్ష్మణుడు తండ్రియైన దశరథుని కంటే శ్రీరామునే మిక్కిలిగా ప్రేమించాడు, పూజించాడు, అనుసరించాడు, సేవించాడు. "భ్రాతా, భర్తాచ, బంధుశ్చ పితాచ మమ రాఘవః" అను లక్ష్మణుని వచనములను బట్టి శ్రీరాముని యెడల అతని భావము స్పష్టంగా గోచరిస్తున్నది. సోదర ప్రేమ అంటే ఏ విధంగా వుండాలో తన జీవన గమనంలో చూపించి, నిరూపించి, అనుసరించి చూపిన ప్రేమస్వరూపుడు, కరుణామయుడు. నేటి సమాజం లక్ష్మణుని ఆదర్శంగా స్వీకరిస్తే వైరుధ్యాలకు తావే వుండదు.

లక్ష్మణుడు కర్తవ్య పాలన విషయంలో చాలా పరమ కఠోరుడు. శ్రీరామచంద్రుడు ఒక పర్యాయం బ్రాహ్మణ వేషంలో వచ్చిన కాలపురుషునితో రహస్య సంభాషణలు చేయవలసి వస్తుంది. అప్పుడు లక్ష్మణుని ద్వారం వద్ద కాపలా వుంచి, ఎవరైనా ఆ సమయంలో లోపలికి రానిచ్చినగాని, తమ సంభాషణలు వినినగాని, అట్టివాని తల తీసివేయటం జరుగుతుందని హెచ్చరించి లోపలికి వెళ్ళిపోతాడు శ్రీరాముడు. ఇంతలో దుర్వాస మహర్షి వచ్చి తక్షణమే శ్రీరాముని దర్శించవలెనని వత్తిడి చేస్తాడు. లక్ష్మణుడు ససేమిరా అంగీకరించడు. దుర్వాసునికి కోపం వస్తుంది. తన రాకను శ్రీరామునికి వెంటనే తెలియబరచని యెడల అయోధ్యా రాజ్యము, రాజసంతతి, ప్రజలు యావత్తూ సర్వనాశనం అయ్యేట్లుగా శపించుతానని హెచ్చరిస్తాడు. లక్ష్మణునికి సంకట పరిస్థితి ఏర్పడుతుంది. తనవల్ల దేశం, వంశం యావత్తూ సర్వనాశనం కావటానికి మనస్కరించదు. తానొక్కడూ శ్రీరాముని శిక్షకు గురియై మరణించినా ఫరవాలేదని భావించి, దుర్వాసుని రాకను లోపలికివెళ్ళి శ్రీరామునికి ఎరుక పరుస్తాడు. శ్రీరాముని ఆజ్ఞను తిరస్కరించి లోపలికి వెళ్ళినందులకు దండించవలసిందని స్వయంగా రామునే కోరుతాడు. "నీవు నా కొరకు విచారించకుము. నన్ను వధించి ప్రతిజ్ఞను పాలింపుము. ప్రతిజ్ఞను పాలింపని నరులు నరకమును పొందుదురు. సంశయించకుము. నన్ను వధించి ధర్మమును వృద్ధి చేయుము" అని శ్రీరాముని కోరుతాడు. చిట్టచివరికి

సీతికోవిదుల సలహా ననుసరించి లక్ష్మణుని దేశ బహిష్కారం చేశాడు శ్రీరాముడు. తను మనసారా ప్రేమించిన అన్న చివరకు తనను త్యజించినా, అతనిపై ఏమాత్రం కోపించక ఆజ్ఞను శిరసావహిస్తాడు. అనుశాసనమందు గల లక్ష్మణుని దృఢపైఖరిని తలచుకుంటే ఎంతటి పాషాణ హృదయమైనా ద్రవించక మానదు. అతనిలోగల అకుంఠిత దీక్ష, కర్తవ్య నిష్ఠలు భావితరాల వారికి అత్యంత ఆదర్శనీయములు.

అధికార వ్యామోహంతో చేయరాని పనులు చేస్తూ, మారణహోమాలను సృష్టించడానికి కూడా ఏమాత్రం వెనుకాడనటువంటి ప్రస్తుత సమాజానికి లక్ష్మణుని ఆదర్శం, త్యాగం పరిష్కార మార్గాన్ని చూపించగలుగుతాయి. స్వార్థమే జీవిత పరమావధిగా నెంచి, అధికారం కోసం ఎంతటి నీచానికైనా వెరువని పచ్చి అవకాశవాదులు సయితం ఒక్క పర్యాయం రామాయణ మహాకావ్యమును చదివిన యెడల మానసిక పరివర్తన చెందగలరు. లక్ష్మణుని సచ్ఛీల, నిస్వార్థ, త్యాగమయమయిన జీవితం ఎంతటి వారికైనా శిరోధార్యం కాగలదు. నేటి నాయకులు, పరిపాలకులు లక్ష్మణుని ఆదర్శముగా గైకొనిన యెడల వైషమ్యాలకు, వైరుధ్యాలకు తావే వుండదు.

మీ ఉత్తరాలు అందుతూనే వున్నాయి నా ఉత్తరాలు మీకు అందనట్లు వ్రాస్తున్నావు. ఆశ్చర్యంగా వున్నది. ఈ నెల 6వ తేదీనుంచి యిప్పటికి మీకు ఐదు ఉత్తరాలు వ్రాశాను. అక్కడి పోస్టాఫీసులో ఎంక్వయిరీ చేయించగలవు. ప్రస్తుత అత్యయిక పరిస్థితి మహిమ అనుకుంటాను. 26వ తేదీ రాత్రి బయలుదేరి 28వ తేదీ ఉదయానికి రాగలవు. చిరంజీవులందర్ని తీసుకొని రాగలవు. మిమ్మలను చూడక చాల కాలమైంది గదా !

ఇక వుంటా......

ఇట్లు

" సీ "

## మీకు తెలుసా ?

మెక్సికో సిటీలోని 'ప్లాజా' ప్రపంచంలో కెల్లా పెద్ద బుల్‌ఫైట్ ఆటస్థలం. దాని కెపాసిటీ దాదాపు 48 వేలు.

మన దేశంలో మొదటి సిమెంటు ఫ్యాక్టరీ 1904 లో మద్రాస్‌లో స్థాపించబడింది.

టాల్క్ టాల్కమ్ పౌడర్‌లో ఉపయోగించబడేది. ఇది అత్యంత మృదువైన మినరల్.

కంగారు మృగం సాధారణంగా 5 అడుగులు అంతకంటే కొన్ని అంగుళాలు ఎత్తుంటుంది. అయితే ఇది పుట్టినప్పుడు ఎంతుంటుందో తెలుసా ? కేవలం రెండంటే రెండే సెంటీమీటర్లు.

కుక్కలకు అద్భుతమైన ఘ్రాణశక్తి ఉంటుంది. కొన్ని రకాల కుక్కలు 5 లక్షల రకాల సున్నితమైన వాసనల్ని పసిగట్టగలవు.

మొట్టమొదట 'అటాసు'ను మెర్కేటర్' అను పండితుడు రూపొందించాడు. అట్లాసు అను రక్కసి ఆకాశాన్ని మోస్తున్నట్లుగా ఆ పుస్తకం అట్టమీద చిత్రించడంవల్ల ఆనాటి నుంచి ఆ పుస్తకానికి ఆ పేరే స్థిరపడిపోయింది.

టెక్సాస్‌లోని డాటా పాయింటు ఎలక్ట్రానిక్స్ కార్పొరేషన్‌వారు 'పొగరానిసిగరెట్టును తయారు చేసి, 'ఫేవర్' అని పేరుపెట్టారు. ఈసిగరెట్లలో పొగాకు ఉండదట. దీనిలో నికోటిన్ ఉంటుంది. ఇది సిగరెట్టు లాగే ఉండి సిగరెట్టు ఇచ్చే సంతృప్తి ఇస్తుంది. గట్టిగా దమ్ము లాగినప్పుడు నికోటిన్ పొగలు నోటిలోకి పోయి ఆనంద మాధుర్యాన్ని చవి చూపిస్తాయట.

# గీత-అమృతవర్షిణి

సాయి గంగామహాదేవ్

శ్లో॥ జన్మ కర్మచ మే దివ్యమేవం యో వేత్తి
తత్త్వతః ।
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి
సోఽర్జున

భారతీయ వేదాంతమునందు భగవద్గీతకున్నటువంటి అత్యంత సౌందర్యము, అగాధత్వము, అనంతత్వము మరొకచో అగుపించదు. కారణము ఇది అనంతుని వాణి. కావుననే ఇది అనంతవాణి. ఇది అనంత అంతారార్థ గర్భితమైనటు వంటిది. ప్రస్తుతం భగవంతుని అవతారమును, అవతార కార్యమును గురించి చెప్పబడుతున్నది.

అవతారమూర్తి జన్మ, కర్మ రెండునూ దివ్యములు. "దివ్య" మనగా అప్రాకృతములని, ప్రకాశస్వరూపము లని అర్థము. "దివ్" అనగా ప్రకాశము. అవతార మూర్తి జన్మ, కర్మ రెండునూ ప్రకాశములే. అనగా అవతారమూర్తి జన్మ (స్వరూపము), కర్మ (చర్యలు) రెండునూ లోకులలోని అజ్ఞాన తమస్సును దూరం చేయునవని అర్థము. ఇక్కడ "జన్మ" అనగా పుట్టుక అని, "కర్మ" అనగా చర్యలని అర్థము కాదు. ఇవి అంతరార్థ సమన్వితములు. ఇచ్చట "జన్మ" అనగా— "జ" జన్మలను; "నమ" వంచునది. అనగా భక్తుల యొక్క జన్మ పరంపరలను ఆపివేయుటకు వచ్చిన జన్మ అని అర్థము. ఇక "కర్మ" అనగా—"క" అనగా ఆత్మానందములో; "రమ" రమింపజేయునది. అనగా అవతారమూర్తి కర్మలన్నీ భక్తులను ఆత్మానంద ములో రమింపజేయునవే. కానీ అవి అతని కొరకు కాదు. అవతారమూర్తి జన్మ, కర్మలు అట్టి అంతరార్థ గర్భితములు.

ఐతే ఇచ్చట ఇంకొక రహస్యమున్నది. అవతార మూర్తి జన్మ దివ్యమని కానీ, కర్మ దివ్యమని కానీ ఏదో ఒకటి గ్రహించినంత మాత్రమున లాభ ముండదు. రెండింటినీ గ్రహించాలి. దీనికొక చిన్న ఉదాహరణ : ప్రస్తుతము పరమాత్మ దివ్యావతారము శ్రీ సత్యసాయీశ్వరులున్నారు. కొందరు సత్యసాయీ శ్వరులు సాక్షాత్ భగవంతుడని నమ్ముతున్నారు. కానీ వారి కర్మ రహస్యాన్ని గుర్తించనందున పటిఫోటోలు, విగ్రహాలు పెట్టి పూజిస్తున్నారే కానీ ప్రవర్తనలో ఏ మార్పు లేదు. దీని వలన లాభం లేదు. మరికొందరు "వారు భగవంతుడు దాదో, కాదో మాకు తెలియదు. కానీ వారు మొత్తానికి సమాజానికి గొప్ప సేవ చేస్తు న్నారు" అని వారి కర్మ దివ్యత్వాన్ని అంగీకరిస్తు న్నారు. దీని వలన కూడా లాభం లేదు. అవతార మూర్తి జన్మ, కర్మల రెండింటి యొక్క దివ్యత్వాన్ని గుర్తించి నేనే మానవులు సాధనాభిముఖులై తరించ గలుగుతారు.

ఆ గుర్తించడం కూడా "తత్త్వతః" గుర్తించాలి. అట్లు గుర్తించిన వాడే దేహమును త్యజించి మరల జన్మను పొందడు. ఐతే "తత్త్వతః" అంటే ఏమిటి? "తత్త్వతః" అంటే ఒక్కొక్కరు ఒక్కొ విధంగా భావిస్తుంటారు. కానీ ఆయా అర్థముల ప్రకారం గుర్తించినా మోక్షం కలుగుతున్నదా? లేదే! అందువలన అవి సంపూర్ణార్థములు కావు.

"తత్త్వతః" అనగా "తత్, త్వం" రెండు పదార్థ ముల కూడిక. తత్ పదార్థము, త్వం పదార్థము ఏక మైనచో తత్త్వమౌతున్నది. తత్త్వతః గుర్తించట మనగా—తత్ స్వరూపుడైన అవతారమూర్తిని, అతని కర్మలను; త్వం స్వరూపుడైన సాధకుడు తన అంత

రంగంలో దర్శించాలి. అనగా అవతార మూర్తియైన రాముడున్నాడంటే అతణ్ణి తనలోని ఆత్మారాముణిగా, రాముడు దశకంఠుని సంహరించాడంటే ఆ కర్మను తనలోని దశేంద్రియములను ఆత్మారాముడు సంహరించాడని గుర్తించాలి. ఇట్లు తత్ స్వరూపుడైన అవతార మూర్తి జన్మకర్మలను: త్వం స్వరూపుడైన సాధకుడు తనలో దర్శించగలిగిన నాడు అది తత్త్వతః అవతార మూర్తిని గ్రహించినట్లౌతుంది. దీని వలన జన్మ రాహిత్యం కలుగుతుంది. అదే తత్, త్వం ల ఏకత్వం. అదే తత్త్వం. ఇట్లు అనంత అంతరార్థ గర్భితమైనది శ్రీ (కృష్ణ)వాణి; శ్రీ (హరి) వాణి; శ్రీవాణి.



# హం ఆహ్వానించని అతిథి!

తల్లికోడి చీకటిపడగానే తన పిల్లలను పిలిచి రెక్కలక్రింద దాచి తన గూటిలో హాయిగా నిద్ర పోతుంది. సూర్యోదయంతో తాను ముందుగా లేచి పిల్లలను వెంటబెట్టుకొని బయటకు వస్తుంది.

ఇదేమాదిరి అహంకారం (మిథ్యానేను) నిద్రపోయేముందు సంకల్పాలన్నిటిని వెంటబెట్టుకొని హృదయంలో అణిగిపోతుంది సూర్యోదయంతో మేల్కొని సంకల్పాలతో బాహ్యముఖమై లోకంలో విహరిస్తుంది.

అహంకారం మేల్కొన్నప్పుడు సంకల్పాలు ఆడుతున్నాయి. అహంకారం అణిగిపోతే సంకల్పాలు అణిగిపోతున్నాయి, ఇక్కడ అహంకారాన్ని తల్లి కోడి తోను, సంకల్పాలను పిల్లలతోను పోల్చవచ్చు.

సాధకుడు ఈ అహంకారమనే మిథ్యా నేనును నాశనం చేస్తే సకల సంకల్పాలను నాశనం చేసినట్టే, నేనెవరను? అను ప్రశ్నద్వారా ఈ అహంకారాన్ని నాశనం చేయవచ్చు.

ఆత్మ స్వతంత్రంగా అహం నిమిత్తం లేకుండా ఉంటుంది. అహం స్వతంత్రంగా ఉండలేదు. ఆత్మను ఆశ్రయించుకొని వుంటుంది. ఆత్మ లేకుండా అహానికి ఉనికి లేదు. ఆత్మ స్వతంత్రమైంది, అహం పరతంత్రమైంది. ఈ అహం అనే మిథ్యా నేనును ఆహ్వానించని అతిథిగా పేర్కొనవచ్చు. ఆత్మయొక్క పూర్ణజ్ఞానం లేనంతవరకు ఈ అహంకారమనే మిథ్యా నేను సర్వ స్వతంత్ర మహారాజుగా ఏలుబడి చేస్తుంది. ఆత్మా, అహం ఈ రెండింటికి హృదయమే స్థానం. దీనికే హృదయ గుహ అని పేరు.

ఇతనెవరు? అని ప్రశ్నించి విచారించినచో, విచారణ ప్రారంభం కాగానే, ఈ అహం (మిథ్యానేను) క్షణాలపై అదృశ్యమౌతుంది. ప్రశ్నతో విచారించనంత వరకు, అనేక లోక మోహ రుచులతో విందారగిస్తూ కులుకుతూ తిరుగుతూ ఉంటుంది.

సేకరణ : తాటికొండ తిరుపతయ్య

# ముట్నూరి వారి ప్రియ శిష్యుడు కమలాకర

కృష్ణా పత్రికను, ముట్నూరి కృష్ణారావుగారి గురించి పస్తావించుకునేటప్పుడు తప్పని సరిగా గుర్తు చేసుకో లసిన వ్యక్తి కమలాకర వెంకటరావుగారు. దాదాపు ది పన్నెండు సంవత్సరాలు కృష్ణారావుగారిని మలాకర వెంకటరావుగారు, రాపూరు వెంకట సత్య రాయణరావుగారు కుడి ఎడమ భుజాలుగా వుండేవారు.

**కంచి వాసుదేవరావు**

రిలో కమలాకరవారు ముట్నూరి వారికి సాత్విక ంతనకు, గంభీరతకు, మౌనప్రియత్వానికి, భాషకు లికి భావుకతకు వారసులు కాగా రాపూరువారు ఆయన మత్కార ప్రియత్వానికి, సున్నిత హాస్య తత్వానికి రసులు. వీరిద్దరూ 1930 దశకంలో కృష్ణా పత్రికలో ప సంపాదకులుగా చేరారు.

కృష్ణారావుగారి మాదిరిగానే వెంకటరావుగారు రవిందుని వేదాంత తత్వాన్ని సమగ్రంగా ఆకళింపు సుకున్నారు. ఆయన మాదిరిగానే వీరికి శాంతారాం త్రాలంటే చాలా యిష్టం. కృష్ణారావుగారి మాదిరిగానే ంకటరావుగారుకూడా అసలు సిసలు గాంధేయవాది. యన మాదిరి ఈయనకూడా నిరాడంబరుడు. పొగడ్తలు టాటోపం గిట్టనివారు. ఒక్క తలపాగాను మినహా యిస్తే యిద్దరి వేషధారణా ఒకటే.

1945 జూన్‌లో కృష్ణారావుగారి మరణానంతరం టూరు వెంకటేశ్వరరావుగారిని, కోలవెన్ను రామ కోటేశ్వరరావుగారు కృష్ణా పత్రిక సంపాదకులైనప్పుడు ంకటరావుగారు, రాపూరువారు ఉప సంపాదకులుగా కొనసాగారు. 1952లో కృష్ణాపత్రిక యాజమాన్యం ఆర్. డి. యల్. నరసింహమూర్తిగారి చేతుల్లోకి వెళ్ళినప్పుడు రాపూరువారు పత్రికను వదలిపెట్టి వెళ్ళిపోయినా వెంకట్రావుగారు ఆ పత్రికనే అంటిపెట్టుకుని సంపాదకులయ్యారు. తన గురువు కృష్ణారావుగారి అడుగుజాడలలో పత్రికను నిర్వహించారు. ఆ తర్వాత కృష్ణా పత్రిక అనేక ఒడిదుడుకులకు లోనయింది. 1958లో కృష్ణారావుగారి మనవడు రామకృష్ణరావుగారు పత్రిక బాధ్యతను స్వీకరించినప్పుడు పత్రిక తీవ్రమైన ఆర్థిక సంక్షోభానికి గురయి పత్రిక చేతులు మారింది. ఆ తర్వాత వి. వై. యల్. నరసింహారావుగారి కాలంలో కూడా పత్రిక గురించి ఇబ్బందులకు గురి అయి మూసి వేసే పరిస్థితిని చేరుకున్నా వెంకట్రావుగారు ఆర్థికంగా ఎన్నో యిబ్బందులను గురి అవుతున్నా దాన్నే అంటి పెట్టుకుని వున్నారు. చివరకు తెనాలి ఓరియంట్ పబ్లిషింగ్ కంపెనీ యజమాని ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మగారు కృష్ణా పత్రిక యాజమాన్యాన్ని స్వీకరించినప్పుడు వెంకటరావుగారు అయిష్టంగా కృష్ణా పత్రికతో తనకు దాదాపు ఇరవై ఐదు సంవత్సరాలుగల అనుబంధాన్ని తెగతెంపులు చేసుకోవలసి వచ్చింది.

దాదాపు యిదే సమయంలో ఆంధ్రప్రభ దినపత్రిక మద్రాసు నుంచి విజయవాడకు తిరిగి వచ్చింది. నీలంరాజు వెంకటశేషయ్యగారు దాని సంపాదకులు. కృష్ణారావుగారి అంతేవాసి అయిన వెంకటరావుగారిని ఆంధ్రప్రభలో చేరవలసిందిగా ఆహ్వానం వచ్చింది. సంపాదకీయాలు రాసే బాధ్యతను వెంకటరావుగారికి అప్పగించారు. ఆ తర్వాత సంపాదకులైన పండితారాధ్యుల నాగేశ్వరరావుగారు కూడ వెంకట్రావుగారి కలాన్ని వినియోగించుకున్నారు. ఐతే సంపాదకీయంలో

చేసిన ఒక పొరపాటు వలన ఆయన ఉద్యోగం వదులుకోవలసి వచ్చింది. ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు దివంగతులు అయినప్పుడు వెంకట్రావు గారు తన సంపాదకీయంలో స్వర్గస్థులైన ఆ తరం నాయకులు గురించి ప్రస్తావిస్తూ వారి జాబితాలో అప్పటికీ సజీవంగా వున్న కొండా వెంకటరెడ్డిగారిని పొరపాటున చేర్చారు. అందువల్ల ఆయన తన ఉద్యోగాన్ని వదులుకో వలసి వచ్చింది.

ఆంధ్రప్రభ నుంచి విరమించుకున్న తర్వాత ఆయన మరో ఉద్యోగం చేయలేదు. ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో కె. వి. అన్న పేరుతో ఆధ్యాత్మిక వ్యాసాలు వ్రాస్తూ పుస్తక సమీక్షలు చేస్తూ వుండేవారు.

కృష్ణారావుగారి తర్వాత — కృష్ణా పత్రిక దర్బారు షాయర్ కాటూరు వెంకటేశ్వరరావుగారిపట్ల వెంకట్రావు గారికి గురుభావం వుండేది. తను సంపాదకులుగా వున్నప్పుడు కూడా వెంకటేశ్వరరావుగారు కృష్ణా పత్రిక ఆఫీసుకు వస్తే వెంకట్రావుగారు వెంటనే లేచి తన కుర్చీలో కూర్చోపెట్టి తను వేరే కుర్చీలో కూర్చునే వారు.

వెంకటరావుగారు కాంగ్రెస్ వాది. అయినా ఆయన సంపాదకీయాలు ఎంతో నిర్మొహమాటంగా నిష్పాక్షికంగా వుండేవి. కాంగ్రెస్‌ను ఆయన విమర్శించడానికి ఎప్పుడూ వెనుకాడలేదు. కాంగ్రెస్‌కు బద్ధ విరోధియైన కమ్యూనిస్టు పార్టీ దినపత్రిక విశాలాంధ్ర "కత్తిరింపుల" శీర్షిక క్రింద ఆయన సంపాదకీయాలను తరచు పునర్ముద్రిస్తూ వుండేదంటే వాటి విశిష్టత అర్థమవుతుంది. కొన్ని సంవత్సరాల క్రితం శ్రీ పిరాట్ల వెంకటేశ్వర్లు గారు, హైదరాబాద్‌లో కృష్ణా పత్రికను వారపత్రికగా పునరుద్ధరించినప్పుడు వెంకటరావుగారు ఒకటి రెండు సంచికలతో కృష్ణారావుగారిని అమిత ప్రఖ్యాతి తెచ్చిన వెలుగులు శీర్షికను నిర్వహించారు. ఎవరయినా చెపితే తప్ప అది వెంకటరావుగారు రాశారని గ్రహించడం



కష్టం. కృష్ణారావుగారే స్వయంగా వచ్చి వాటిని వ్రాసారా అన్నట్లుగా వుండేవి

వెంకట్రావుగారు చక్కని అనువాదకుడు. ఆయన అనువాదాలు చక్కని శైలిలో నిర్దుష్టమైన వ్యావహారిక భాషలో వుండేవి. తెలుగు విద్యార్థి సంపాదకులు కొల్లూరి కోటేశ్వరరావుగారు వెంకట్రావుగారి చేత కొన్ని ప్రామాణిక ఇంగ్లీషు నవలలను అనువదింపచేసి ఆర్థికంగా ఇబ్బందులలో వున్న ఆయనను కొంతవరకు ఆదుకున్నారు.

ఇక వెంకటరావుగారు నా గురుదేవులు నా పాత్రికేయ జీవితం ఆయన సంపాదకత్వంలోనే ప్రారంభమయింది. ఉప సంపాదకునిగా ఆయన నాకు యిచ్చిన స్వేచ్ఛ-నాకు యిచ్చిన అవకాశాలు మరపురానివి. నేను ఆ రోజులలో పదగుప్ప ధోరణిలో "[illegible]" వారం వారం రేడియో, పుస్తక, సినిమా సమీక్షలు. రాజకీయ వ్యాఖ్యలు చేస్తూ వుండేవాడివి. నా అభిప్రాయ ప్రకట

# విదురనీతి

"బుద్ధౌ కలుషభూతాయాం
వినాశే ప్రత్యుపస్థితే
అనయో నయసంకాశో
హృదయాన్నాపసర్పతి"

వినాశకాలము సమీపించినపుడు, బుద్ధి మలినమయి పోగా, న్యాయము వలె తోచు అన్యాయము హృదయమునందు స్థిరముగా నిలిచిపోవును.

నకు ఆయన పూర్తి స్వేచ్ఛ నిచ్చారు. నా వ్యాఖ్యలూ, విమర్శలు ఒక్కొక్కసారి దూకుడుగా వున్నప్పటికీ ఆయన కాని, ప్రచురణకర్త నరసింహమూర్తిగారు అడ్డు పెట్టేవారు కాదు. సంపాదకీయ రచన మినహా మిగిలిన అన్ని బాధ్యతలు నాకు అప్పగించారు. నా పాత్రికేయ జీవితంలో అది స్వర్ణయుగం.

ఆ రోజులలో ప్రతి సాయంత్రం కాటూరు వారి ప్రియ శిష్యుడు రాచకొండ నరసింహమూర్తిగారు, జమ్మలమడక సుబ్బారావుగారు (ద్వితీయ ప్రపంచ సంగ్రామకాలంలో మిలటరీలో చేరి ప్రపంచమంతా చుట్టి వచ్చారు) ఉభయ కవిమిత్ర వెల్లంకొండ రాఘవ రావుగారు ఇంకా ఎందరో పెద్దలు వస్తూవుండేవారు. అనేక విషయాలపై చర్చలు ధారావాహికంగా సాగిపోతూ వుండేవి. ఆ రోజులను నేను మర్చిపోలేను.

పాత్రికేయ విలువలకు ఉన్నత ప్రమాణాలకు ప్రతీక అయిన వ్యక్తి వెంకటరావుగారు. ఇప్పుడు అటువంటి సంపాదకులు బహు అరుదుగా కన్పిస్తూ వుంటారు. ◯

# వింతలు - విడ్డూరాలు

* "సిమినెస్" తనని తాను గదిలో బంధించుకుంటేనే కాని రచన సాగేది కాదు. "ఎఫ్. ఎం. ఫారిస్టర్" మాత్రం కూర్చోవడం తరువాయిగా రచించడం మొదలుపెట్టేశాడు.

* ఫిలాడియాలోని ఒక కుటుంబంలో "మిచేల్" అనే కుక్క వుండేది. అది చిన్నతనంలో డైనింగ్ టేబుల్ వద్ద కుటుంబ సభ్యుల మాటలు వింటూ పెదవులు ఆడిస్తుండెడిది. కొన్ని రోజులయ్యాక అది తన ఇంటికి వచ్చేవాళ్ళను "హలో హవ్ ఆర్ యూ" అని ఆహ్వానించడం మొదలుపెట్టింది. "ఐ లవ్ యూ, ఐ యాం యాంగ్రీ" అని నేర్చుకోవడమే కాకుండా టి. వి. స్టార్‌గా పేరొందింది. 'లకీ' అనే మరో కుక్క కూడా "ఐ వాంట్ మై బాల్" లాంటి పెద్ద పెద్ద వాక్యాలు కూడా నేర్చుకుని 'మిచేల్'కంటే కూడా కాస ముందడుగు వేసింది.

* మాస్కోలో రాత్రి 10 గంటల వరకూ సూర్యుని వెలుగు వుంటుంది.

* టెలిఫోన్ భవన్ ముందు జరిగే శ్రాద్ధకర్మలకు హాజరు కావలసిందిగా కలకత్తా పుర ప్రముఖులకు, ఇతరులకు ఆహ్వానాలందాయి. ప్రభుత్వ ఆఫీసుల ముందు ఈ ప్రహసనం ఏమిటా అని ప్రజలు పెద్ద సంఖ్యలో వచ్చారట. వచ్చినవారు వచ్చినట్లే విస్తుపోయారు. వారికి అక్కడ ఒక మంచం కనిపించింది. మంచంపైన వున్న టెలిఫోన్ ఫోటోకు పెద్ద పూలదండ వేసి వుంది. బ్రాహ్మణుడు గట్టిగా మంత్రాలు చదువుతున్నాడట. ఈ తంతు ఇలా సాగుతుంటే ఒక్కొక్క వ్యక్తి వచ్చి, తాము అధికంగా ప్రేమించే తమ కుటుంబ సభ్యుడు (ఫోను) వ్యాధితో చనిపోయాడని ప్రకటించారట. •

# జ్ఞానేశ్వరి మాయి

జానమద్ది హనుమచ్ఛాస్త్రి

పండ్రెండవ శతాబ్దంనాటి ముకుందరాజు మరాఠీ భాషలో ఆదికవి. అతడు రచించిన "వివేకసింధు" మరాఠీ భాషలో మొదటి కృతి. ఈ కృతి ఓవి ఛందస్సులో 1671 పద్యాలు కల 18 అధ్యాయాలున్న కావ్యం. దేవగిరి పాలకులైన సేవున్ యాదవులు మరాఠీ భాషా సాహిత్యాలను ఆదరించారు. ఆ కాలంలోనే 'జ్ఞానేశ్వరి' రచింపబడింది.

అర్థం లేని ఆచారాలతో, మూఢనమ్మకాలతో సామాజిక జీవితం అస్తవ్యస్తంగా వున్న కాలమది. జ్ఞానదేవ్ ఎన్నో అవాంతరాలను ఎదుర్కొన్న ధీమంతుడు. అతని ముత్తాత త్రియంబకపంత్ క్రీ. శ. 1207లో బీద ప్రాంత పాలనాధికారిగ ఉండేవాడు. అతని కుమారుడు గోవిందపంత్ - అతని కొడుకు విఠ్ఠలపంత్. విఠ్ఠలపంతుకు నలుగురు కుమారులు. మొదటివాడు నివృత్తినాథ్ (1273-1297) రెండవవాడు జ్ఞానదేవ్ (1275-96), మూడవవాడు సోపాన (1277-96), చివరిగ కూతురు ముక్తాబాయి (1279-97). గోదావరికి ఉత్తరంగా వున్న అపెగావ్ వారి స్వగ్రామం. విఠ్ఠలపంత్ ఆ గ్రామ కరణం. అతని భార్య రుక్మాబాయి. ఆళంది గ్రామకరణం కూతురు.

తండ్రి గోవిందపంత్ మరణం విఠ్ఠలపంత్‌ను కృంగదీసింది. చాలాకాలం తనకు సంతానం కలుగకపోవటం అతనికి మరింత వ్యథ కల్గించింది.

విరక్తుడైన విఠ్ఠలపంత్ భార్యకు నచ్చచెప్పి సన్యాసాశ్రమం స్వీకరించి కాశీకి వెళ్ళిపోయాడు. విఠ్ఠలపంత్ గురువు దేశ సంచారం చేస్తూ రుక్మాబాయి వున్న ఆళంది గ్రామానికి వస్తాడు. విఠ్ఠలపంత్ కథ విని బాధ పడినాడు. మరల వారణాసి వెళ్ళి విఠ్ఠలపంత్‌ను కలుసుకున్నాడు. సన్యాసం విసర్జించి స్వగ్రామం వెళ్ళి గృహస్థాశ్రమ జీవితం గడపమని సూచించినాడు ఆ గురువు. గురువుగారి ఆదేశం మేరకు విఠ్ఠలపంత్ స్వగ్రామం చేరుకున్నాడు. గృహస్థ జీవితం సాగించి నలుగురు బిడ్డలతండ్రి అయినాడు. సన్యాసి సంసారిగా మారటాన్ని సమాజం తీవ్రంగా నిరసించింది. బ్రాహ్మణ సమాజం అతనిని దాదాపు వెలివేసింది. విఠ్ఠలపంత్ కుమారులకు ఉపనయనం జరుపుటకు బ్రాహ్మణులు సమ్మతింపలేదు. విఠ్ఠలపంత్ భార్యాబిడ్డలతో తీర్థయాత్రలకు బయలుదేరాడు. నీకు మరణమే శరణ్యం అన్నది బ్రాహ్మణ సంఘం.

గత్యంతరం లేకపోయింది. నలుగురు పిల్లలను వదలిపెట్టి విఠ్ఠలపంత్ భార్యతో పాటు అదృశ్యమయ్యాడు. ప్రయాగలో ప్రాణత్యాగం చేశారని, హిమాలయాలకు వెళ్లారని వదంతులు వ్యాపించాయి. మొదటి ఇద్దరు కుమారులు నివృత్తినాథ్, జ్ఞానదేవులు బ్రాహ్మణులను తృప్తిపరచి, ఉపనయనం కావించుకుని వైదిక ధర్మంలో వుండవలెనని యత్నించారు, కాని బ్రాహ్మణ ప్రముఖులు సమ్మతించలేదు. ఈ ప్రతిక్రియకు వారు నిరాశ చెందలేదు. ధైర్యంగా ముందంజ వేశారు. శాస్త్రాలను అధ్యయనం చేశారు. వారు సమాజానికి ఎదురుతిరగలేదు. హృదయాన్ని, బుద్ధిని పరివర్తి మొనర్చుకున్నారు.

జ్ఞానదేవ్ ఎన్నో మహిమలను ప్రదర్శించాడని ప్రతీతి. బఱ్ఱె నోట వేదమంత్రాలను పలికించాడని, మట్టిగోడను నడిపించాడన్న కథలు వ్యాప్తిలోకి

వచ్చాయి. అవి ఎంతవరకు వాస్తవాలో చెప్పలేం.కానీ జ్ఞానదేవ్ ఇరవై రెండేళ్ళ వయసులోనే 'జ్ఞానేశ్వరి'ని రచించాడు. గురువుగా తన అన్నగారిని యెన్నుకొని, అతని మార్గదర్శకత్వంలో జ్ఞానేశ్వరి (భగవద్గీత వ్యాఖ్యానం) రూపొందించాడు.

జ్ఞానదేవ్ రచనలుగా క్రింది గ్రంథాలు మరాఠీలో ప్రసిద్ధంగా వున్నాయి. జ్ఞానేశ్వరి, అమృతానుభవం, చాంగదేవ్ పాసష్టి, అభంగాలు భగవద్గీత మరాఠీలో 'జ్ఞానేశ్వరి'గా విఖ్యాతి గాంచింది. ఈ గ్రంథంలో నాథ సంప్రదాయం, శాంకరీ సంప్రదాయం, భక్తి సంప్రదాయం సమ్మిళితమై ఉన్నాయి. "జ్ఞానేశ్వరీ మాయి"గా ఈ కృతి గౌరవింపబడుతున్నది.

"జ్ఞానులలో జ్ఞాని" అని తుకారాం జ్ఞానేశ్వరుని ప్రస్తుతించాడు. జ్ఞానం కొందరి సొత్తుగా భావించిన కాలమది. మతమౌఢ్యం పెచ్చరిల్లిన కాలమది. వేదాలు దేవ ఆలయద్వారాలను అందరికీ తెరవని కాలమది. ఈ నేపథ్యంలో అందరికీ బ్రహ్మవిద్యను పంచిపెట్టాలని [illegible] నడిపింపచేయాలని సంకల్పించి 'జ్ఞానేశ్వరిని' యిచ్చి [illegible]



# విజ్ఞానవా

## కార్బన్ పేపర్

రెండు కాగితాలపై ఏకకాలంలో ఒకే పోలికలలో వుండే విధంగా వ్రాయడానికి కార్బన్ పేపర్ రెండు కాగితాల మధ్య ఏర్పాటు చేస్తారు. 1806 లో "రాల్ఫ్ వెడ్జ్‌వుడ్" అనే లండన్ నివాసి కార్బన్ పేపరు తయారుచేసాడు. పలుచటి కాగితాన్ని ఇంకులో పూర్తిగా తడిపి బ్లాటింగ్ పేపరు మధ్యవుంచి ఇంకును పీల్చిన తరవాత ఆ ఇంకు కాగితాన్ని ఉపయోగిస్తే కార్బను పేపరులాగా ఉపయోగపడి ఒకేసారి ఒకటికన్నా ఎక్కువ పేపర్లపై వ్రాసే విధానాన్ని ప్రారంభించాడు.

## చూయింగ్ గమ్

1848 లో అమెరికాలో మెయినుకు చెందిన జాన్ కర్టిస్ వంటగదిలో తొలిసారిగా చూయింగ్ గమ్‌ని తయారుచేశాడు. 1850 లో విశేషాదరణ రావడంతో చూయింగ్ గమ్ ఫ్యాక్టరిని స్థాపించాడు. రబ్బరువస్తువులను తయారుకోసం రబ్బరుచెట్టు బెరడు వద్ద గడ్డకట్టిన ముద్దను చేతితో నొక్కి అది ఎంతసేపు నొక్కినా ఎలాంటి మార్పు రాకపోవడంతో చూయింగ్ గమ్‌గా చేసి అమ్మకం ప్రారంభించారు. [illegible] వ్యాపారానికి దెబ్బ తగులుతుందని భావించి లండన్‌లో సీటు షాపుల్లో చూయింగ్ గమ్‌లను అమ్మకపోవడంతో రోడ్లపై అమ్మవలసి వచ్చింది. పొందినంత ఆనాదరణ లండనులో పొందలేకపోయింది.

## చాక్‌లెట్

17వ శతాబ్దం నుంచి చాక్‌లెట్లు తయారీ జరుగుతూనే వుంది. కాని స్విట్జర్‌లాండ్‌లో 1819 లో "ఫ్రాంకోయిస్ లూయిస్ కైలార్" తొలిసారిగా చాక్‌లెట్ కడ్డీలను తయారుచేసే ఫ్యాక్టరీ తొలిసారిగా ప్రారంభించాడు. 1866 లో "క్యాడ్‌బరీ చాక్‌లెట్"లు తయారీ ప్రారంభమయింది.

- జి. ఎస్. సాయినాథ్



( 8వ పేజీ తరువాయి )

## డాక్టర్ కటమంచి

ఆయన మేధాసంపత్తిని కాంగ్రెసు వినియోగించుకొనకపోవడం శోచనీయం. ఆయన స్వతంత్ర ప్రవృత్తి ఇందుకు కొంత అడ్డం వచ్చినా కాంగ్రెసు కూడా అడుగడుగునా ఆయనను ఆంధ్ర యూనివర్శిటీ వైస్‌ఛాన్సలర్ పదవినుంచి దింపాలని ప్రయత్నించింది. ఆయన ఆనాటి కాంగ్రెసులోనే వుండివుంటే, ఆయన చరిత్ర బహుశా మరొకవిధంగా వుండివుండేది!

శ్రీ రామలింగారెడ్డి ప్రజానాయకుడు కాకపోవచ్చు; కాని, ఆయన మేధాశక్తి ప్రజలపై వేసిన ముద్ర ప్రగాఢమైనది. ఆయన రచనల సంఖ్య స్వల్పమైనదే కావచ్చు; కాని, వాటి ప్రశస్తి అనల్పం. ఆయన ఉదార స్వభావం, మౌలిక చింతన, స్వతంత్రప్రవృత్తి. కళాదృష్టి, విజ్ఞానపిపాస, మానవతా దృష్టి ఆదర్శప్రాయమైనవి. ఆయన ఆంధ్రరాష్ట్రం కోసం పోరాడారు.

శ్రీ రామలింగారెడ్డి రసజ్ఞుడు. రసికుడు. అవివాహితుడు. (తనను మద్రాసులో గోఖలే హాలులో జరిగిన సభలో ఎవరో బ్రహ్మావారి అని అంటే అందుకు ఆయనే ఒప్పుకోలేదు.)

ఆంధ్ర విశ్వవిద్యాలయ నిర్మాణంలోను, పెంపకంలోను ఆయన పాత్ర-కలకత్తా యూనివర్శిటీ సర్ అశుతోష్ ముఖర్జీ, బెనారస్ హిందూ యూనివర్శిటీలో శ్రీ మాలవ్యాల పాత్రలతో పోల్చదగినట్టిది. యూనివర్శిటీ వైస్-ఛాన్సలర్‌గా నెలకు రెండువేల రూపాయల వేతనాన్ని స్వీకరించడానికి తనకు అవకాశం వుండగా, ఆయన వెయ్యిరూపాయలు మాత్రమే తీసుకున్నారు. మిగిలిన మొత్తాన్ని యూనివర్శిటీకి విరాళంగాయిచ్చారు. ఆంధ్రా యూనివర్శిటీకి విచ్చుమొత్తి నిధులను సమకూర్చి దాన్ని ఇప్పటిదానిగా ఆయన రూపురేఖలు దిద్దారు.

శ్రీ రామలింగారెడ్డి 1951 ఫిబ్రవరి 24వ తేదీన శాశ్వతంగా కన్ను మూశారు. అప్పటికి ఆయనకు 71వ సంవత్సరం.

ఆయన లేకపోయినా, ఆయన సూక్తులు, ఛలోక్తులు ఆంధ్ర ప్రజా హృదయాలలో శాశ్వతంగా నిలిచి పోయాయి.



వైద్యవాణి

## మాసరి తీగ

ఇది తీగజాతిలోనిది. ఇది వొంకలపై ప్రాకుచుండు గట్టి నార గలిగిన తీగ. దీని ఆకులు కొంచెము కోలగా నుండి చిన్నగా నుండును. ఆకుల మధ్య సమరేఖ లుండును. ఆకు ముదిరినచో ఆకుపచ్చ రంగుగానే యుండును. కాయలు చిన్నవిగ విడివిడిగా ఉండును. లేతకాయలు ఆకుపచ్చగను, పండుకాయలు నలుపు రంగుగను ఉండును. దీని వేరు, తీగ చాలా దృఢము గను, బలముగను వుండును.

ఇది తీపి రుచి గలిది. శీతవీర్యము, గురుగుణము, మధుర విపాకము గలది. కఫ, పైత్యహరము, రక్త, విష దోషాదులను హరించును. మిక్కిలి వీర్య వృద్ధి చేయును.

మాసరి రసములో సాంబ్రాణి చూర్ణము కలిపి త్రాగిన మధుమేహములు కట్టును; దీని సమూల రసంలో ఆవు నేతిని గలిపి ప్రతిదినము ప్రాతః కాలమున త్రాగుచున్న ఉన్మాదములు, చిత్తభ్రమలు తగ్గును, అందు కొంచెము పంచదారను కూడా చేర్చినచో మూత్ర కృచ్ఛ్రములు తగ్గును. దీని పసరు నీటిలో పోసి చేతితో తరచి కొంతసేపు ఉంచిన అడుగున బిళ్ళ కట్టును. దానిని తీసి ఎండబెట్టి ఆ చూర్ణములో పటిక బెల్లము చూర్ణము చేర్చి తినుచున్న శగ రోగములు తగ్గును. ఆ చూర్ణమునే నరమామిడి చెక్కరసముతో నిచ్చిన ప్రదరములు కట్టును.

- యస్. యస్. దుర్గారావు

# దైవం విశ్వవ్యాపకుడే

డా॥ జూమ్. సాయి (థాయిలాండ్)
అంతరిక్ష శాస్త్రవేత్త, పార్లమెంటు సభ్యులు

ఈ విశ్వం ఆవిర్భవించకముందు ఒకే ఒక శబ్దము మాత్రమేవున్నది. ఈ విశ్వం ఆవిర్భావానికి ‘ఓం’ శబ్దమే కారణము. ఆ శబ్దము యొక్క స్వరూపమే, తత్వమే భగవంతుడు. ఈ విషయం బైబిల్ (సైంట్ జాన్ ప్రకారం)లో కూడా వ్యక్తీకరించ బడింది. ఈ శబ్దంనుంచే విశ్వరచన అంతా జరిగింది. ఆ శబ్దం లేక జగత్తే లేదని క్రైస్తవ ధర్మంలో కూడా ఉంది. ‘ఓం’కార నాదం లేకుండా ఏదీ ఆవిర్భవించదు, మనుగడ సాగించదు. సైన్సు దృష్టిలో కూడా ఈ సృష్టి రచనకు ఒక ‘కర్త’ అంటూ వుండాలి కదా !

సైన్సు ప్రకారం ఈ జగత్తు ఆవిర్భావానికి కారణం ఒకటి వుండాలి. దీనినే Big-Bang సిద్ధాంతం అంటారు. పెద్ద శబ్దంలో పుట్టే శక్తివల్లనే పదార్థ సృష్టి జరుగుతున్నదని సైన్సు చెబుతున్నది. పదార్థము జడమైనది కావచ్చు. కానీ ఈ పదార్థము నుంచే శక్తి ఉద్భవిస్తోంది. దీనినుండే భూమి, ఆకాశము, నక్షత్రాలు, గెలాక్సీలు, సమస్త విశ్వమంతా ఏర్పడింది. అయితే దీనికి ఆధారము అణువు. అణువులోనే పదార్థమూ వున్నది. ప్రతి అణువులోను ఎలక్ట్రాన్లు, ప్రోటాన్లు వున్నాయి. ఎలక్ట్రాన్లు వెలుపలకు పరిగెత్తుతూవుంటే, ప్రోటానులు లోపలికి దారితీస్తాయి. ఈ రెండింటినీ ఆయా నియమాలలో బంధించి వుంచేదే న్యూట్రాన్. ఈ పరమాణువులు లేకపోతే విశ్వమే లేదు. పదార్థమే లేదు. ఇవన్నీ ప్రకృతి సూత్రాలను అనుసరించేవే. ఈ సృష్టి అంతా ఒక అనిర్వచనీయమైన శబ్దశక్తినుంచే ఉద్భవించిందని సైన్సు కూడా నిర్ధారించింది. అయితే ఈ సకల పదార్థ సృష్టికీ ఆధారభూతమైన ‘కర్త’ ఎవరు ? అనే ప్రశ్నను కూడా సైంటిస్టులు వేసుకుంటునే వుంటారు. కాబట్టి ఈ మొట్టమొదటి శబ్దమే భగవంతుడని ఈ విశ్వసృష్టికి ఆధారభూతుడు దైవమే అని విశ్వ సించక తప్పదుకదా ! చివరకు సైంటిస్టులు కూడా భగవంతుడు ఈ రీతిగా అణువులో దాగిన శక్తి అనీ, ప్రతి పదార్థంలోనూ దాగిన శక్తి అనీ, ఈ శక్తియే చెట్టులో, పుట్టలో; రాయిలో, రప్పలో; సకల జీవరాసుల లోనూ వున్నదని అంగీకరిస్తున్నారు. ఈ దైవీశక్తి లేనిచోటు సృష్టిలో ఎచటా కానరాదని విదితమవుతుంది. ఈ రీతిగా సైంటిస్టు దృష్టిలో కూడా దైవం విశ్వవ్యాపకుడే! (Omni Present)

ఇదే విశ్వశక్తిని ఈనాడు మనం భగవాన్ శ్రీ సత్య సాయిబాబావారిలో చూస్తున్నాం. దైవం మానవరూపంలో యిక్కడ అవతరించాడు. ఆతడే సృష్టికర్త, ఆతడే సృష్టి. అందువల్ల భగవాన్ బాబా ఈ యుగావతార పురుషుడు. మనం ఈనాడు అనేక క్లిష్ట సమస్యలతో జీవితాన్ని బరువుగా సాగిస్తున్నాం. దైవం పరమ ప్రేమస్వరూపుడు, కరుణామయుడు. కనుకనే మనల్ని ఈ దుస్థితిలో చూడలేక, మనల్ని ఉద్ధరించటానికే మానవ రూపంలో అవతరించాడు. మన సంరక్షణ బాధ్యత ఆయన వహిస్తున్నారు. మనం ఏ గమ్యానికి చేరాలో, మనల్ని ఏ గమ్యానికి చేర్చాలో కూడా వారికి

“వ్యక్తులు వేరు కావచ్చు. కానీ అందరిలోవున్న దైవం ఒక్కడే”. అని భగవాన్ బాబా ప్రబోధిస్తున్నారు. కనుక మనం అందరినీ ప్రేమించవలసిందే. మనం ప్రతి ఒక్కరికీ సేవ చేయాలి. ‘నీవు’, ‘నేను’ అనే భావాలన్నీ విశ్వవిరాట్ స్వరూపునిలోని భాగాలే. నేను స్వామికి చాలా సన్నిహితంగా వున్నాను. కనుకనే వారెప్పుడూ అందరినీ ప్రేమిస్తారనీ, ప్రేమిస్తూ వుంటారని తెలుసుకున్నాను. కానీ భగవంతునికి దగ్గరా, దూరం అనేవి లేవు. మనం ఈ భూగోళంలో మరొక అంచున వున్నప్పటికీ, మనం భగవాన్ బాబావారికి అత్యంత సన్నిహితంగా వుండవచ్చు. అసలు మీరూ నేను, బాబా వేర్వేరుగా వుంటేనే గదా! దగ్గర, దూరం

అనే భావాలు కలిగేవి. మనమందరం ఒక్కటే అనే గుర్తింపు మనలో కలగాలి. అప్పుడు మనది విశ్వ కుటుంబం అయిపోతుంది. ఈ దృష్టిలో చూస్తే నేను మీకు సేవచేస్తే, నాకే నేను చేసుకుంటున్నట్లు అర్థమవుతుంది. "సేవ అనేది మనంచేసే పనుల్లో ప్రతిబింబించే ప్రేమయే" అని అంటారు బాబా.

ఈ రోజున ప్రపంచానికి శాంతి భిక్ష పెట్టటంకోసం అవతరించిన అవతార పురుషుని సమకాలీనులుగా వుండే అదృష్టం మనకు లభించింది. మనపై ప్రేమతో మరొకసారి 'ప్రేమసాయి'గా భగవాన్ అవతరించనున్నారు.

" Happy, be Happy సంతోషంగా వుండండి! సంతోషంగా వుండండి!" అంటారు బాబా. ఇది నిజంగా మనందరికీ సంతోషకరమైనదే. మనందరం ఈ దైవానికి జన్మదినోత్సవ వేడుకలు చేయడానికని యిక్కడ ఒకటిగా చేరాం. ఇప్పుడు అనుభవిస్తున్న ఆనందానికి అవధులు లేవు, మాటలు చాలవు. మనం యింకా...యింకా... సన్నిహితంగా, ఆత్మీయులంగా మెలగాలి. కారణం ఏమిటి? మనందరి హృదయాల్లోను వుండేది ఒకే దైవం కదా! అందుకే మనం అందర్నీ ప్రేమిద్దాం, సేవిద్దాం.

( ది 21-11-9[illegible] ప్రసంగం నుండి )

# శ్రీ సత్యసాయి గీతాభాష్యము

కూములూరి ప్రభ

కృష్ణపరమాత్మ జ్ఞానయోగమును 4 వ అధ్యాయములో జ్ఞానమును తపస్సు, యజ్ఞము, అగ్ని, నౌక, ఖడ్గము మొదలగు అనేక రూపముల వర్ణించి చెప్పెను. "జన్మ కర్మచమే దివ్య" (4 అ. 9 శ్లో) శ్లోకములో ఎవడు నా యొక్క దివ్య జన్మమును, కర్మమును గురించి యదార్థముగ తెలుసుకొనునో (యదా యదా హి ధర్మస్య, పరిత్రాణాయ సాధూనాం); ఎప్పుడెప్పుడు ధర్మము క్షీణించి అధర్మము వృద్ధియగునో అప్పుడప్పుడు నేను [illegible] సృష్టించుకొందును, అవతరించుచుందును. సామాన్య మానవుల దృష్టికి నేను అనేక కాయములను ధరించి అనేక జన్మల నెత్తితినని భావింతురు. లోకోద్ధరణమునకు అవసరమొచ్చినప్పుడంతా ఒక కాయము ధరించి లోకమునను సూచనామములతో గోచరించినను, మున్ని జన్మల విషయమైనను నాకు జ్ఞాపకముండును. నేను సర్వజ్ఞుడను, సర్వశక్తుడను. నీకే [illegible] నాకు మాత్రము అంతా తెలియును. అయితే నీ జ్ఞానశక్తిని అజ్ఞానము ఆవరించుటవలన నీకు తెలియజాలకున్నది. నేను జ్ఞానమయుడను కనుక నాకు సర్వవేళలయందును స్పష్టముగా తెలియుచుండును. నేను ప్రకృతి అను అద్దమందు ప్రతిబింబించుచున్నాను. నేను జన్మరహితుడను. మానవ జన్మలెత్తుటకు మనుష్యులు చేసిన పుణ్య పాపకర్మలు కారణములగును అయితే అవతార జన్మలను సజ్జనుల యొక్క సత్సంకల్పాలు, ప్రార్థనలు, సాధు కృత్యములు, దుష్టుల దుష్కర్మలే కారణము" అని ఉపదేశించెను. మనుజుడు ఏ క్షణమున భగవత్తత్త్వము నెరుగునో (ఆత్మజ్ఞానమును పొందునో) ఆ క్షణములోనే ( దేహముండగానే ) మోక్షమును పొందునని వివరించెను.

"జ్ఞానతపస్సున కామ క్రోధ భయములను విడిచి ( వీత రాగ భయ క్రోధ 4అ-10 శ్లో ) నా యందే చిత్తము లగ్నము చేసి, నన్నాశ్రయించినవారు అని; 19 వ శ్లోకములో ఎవడు సర్వకర్మలు, కోరికలు, సంకల్పములు అనునవి వేక చేయునో అట్టి జ్ఞానమను అగ్నిచే దహింపబడిన కర్మలు చేసినవానిని పండితులను విజ్ఞులందురు అని — కర్మను ఏ రీతిగా చేసిన అది బంధములను, పాపమును కలుగచేయదో); దేనియందును ఆసక్తి లేనివాడును, ఆత్మజ్ఞానమందే మనస్సు నిలిపినవాడు (జ్ఞానావస్థిత చేతసః) చేయు కర్మ బంధము కలిగించదని; బ్రహ్మార్పణం బ్రహ్మ హవిర్బ్రహ్మాగ్నౌ అను 24 వ శ్లోకములో అన్నియు బ్రహ్మస్వరూపములే అను ఏకాగ్ర భావముతో కర్మలను చేయువాడు బ్రహ్మమునే పొందగలడు అను జ్ఞాన యజ్ఞ ప్రాశస్త్యమును; ఇంద్రియములను మనోనిగ్రహమను జ్ఞాన అగ్నియందు (ఇంద్రియాగ్నిషు జుహ్వతి) హోమము చేయవలెనని, అప్పుడు మనస్సు ఆత్మజ్ఞానమును దీప్తిచే (జ్ఞానదీపితే) దేదీప్యమానముగ ప్రజ్వలించును. అట్టి జ్ఞానదీపమును వెలిగించి అమృతమయ కాంతిపుంజములను వెదజల్లవచ్చును" అని కృష్ణపరమాత్మ వివరించెను.

# నవయుగ శాంతి ప్రవక్త బాబా

_ గోల్డ్‌స్టీన్ (అమెరికా)

భగవాన్ శ్రీ
సంభూతుడు, యుగావతారుడు. వారి అవతరణవల్ల ఈ సమాజంలో ఒక దివ్యమైన మానవోద్ధరణ ఉద్యమం ప్రారంభమైంది. మహోద్యమంచేత మానవత్వం యొక్క వికాసం త్వరితగతిన సాధించబడుతోంది. మానవ ప్రగతికి, అభ్యుదయానికి భగవాన్ బాబావారు ఒక సురక్షితమైన, సుకరంగా ప్రయాణం చేసే రాచబాటను ఏర్పరుస్తున్నారు. ఈ మార్గంలో మనం ప్రయాణం సాగించవలెనంటే అందుకు చేయవలసినదంతా భగవాన్ చేసే చేతలను చూచి మనం కూడా అలా నిత్యజీవితంలో ఆచరించటమే. భగవాన్ ప్రబోధాలు మనకు త్రోవను చూపించే సైన్ పోష్టులవంటివి.

భగవాన్ ప్రపంచ మానవాళినందరినీ సురక్షితంగా, ఈ జీవనయాత్రలో ముందుకు తీసుకొని వెళ్ళే సనాతన సారధిగా అవతరించారు. ఎన్ని భాషలున్నా, ఎన్ని జాతులున్నా, ఎన్ని మతధర్మాలున్నా _ అందరికీ ఈనాడు భగవాన్ బాబావారు " నవయుగ శాంతి ప్రవక్త " ( Prophet of Peace )

భగవాన్ బాబావారిని మనం ఆరాధిస్తున్నాం. కేవలం ఆరాధించటం చాలదు. ఈ ఆరాధన మన ఆచరణలో ప్రతిబింబించాలి, మన జీవితాలను మార్చేదిగా రూపొందాలి.

ఈనాడు ప్రపంచంలో మానవులందరూ తీర్చలేని ఆధ్యాత్మికమైన ఆకలిచేత పీడింపబడుతున్నారు. మానవ జీవితాలలో ఏదో ఒక అనిర్వచనీయమైన వెలితి ఏర్పడింది. ఈ పరిస్థితులను సరిదిద్దుటకే ఈనాడు ప్రపంచమంతటా శ్రీ సత్యసాయి సేవాసంస్థలు ఆవిర్భవించాయి. అవగాహనతో, చిత్తశుద్ధితో కృషిచేస్తున్నాయి. క్రమశిక్షణతో, కృతనిశ్చయంతో, ఆత్మార్పణభావంతో భగవాన్ బాబావారి దివ్య సందేశాలను ప్రపంచవ్యాప్తం చేస్తున్నాయి. బాబావారి అవతారవాణిని, విశ్వజనీన సందేశాన్ని వినిపిస్తున్నాయి. బాబా చేబట్టిన ఈ మహోద్యమంలో ఎందరో ఉపకరణాలుగా సేవలు చేస్తున్నారు.

భగవాన్ బాబావారి దివ్య ప్రబోధాలలో మనసులను మార్చివేసే దివ్యశక్తి వుంది. నేను భగవాన్ సన్నిధికి రాకముందు నా జీవితం ఒక ఖాళీ అయిపోయిన పాత్రవంటిదిగా వుంది. అలాంటి జీవితం ఈనాడు భగవాన్ బాబావారి అనుగ్రహంచేత మరల ఒక దివ్య పరివర్తనానికి లోనయింది.

కలల్లో కూడా ఎవరెవరికి ఏమి కనిపించిందో చెప్పగల మహానుభావులను _ ఈ ప్రపంచంలో ఈనాడు ఎవరినైనా చూచారా ?

దేశము, కాలములనే వాటియొక్క పరిమితులను అధిగమించి వాటికి అతీతంగా తమ దివ్య ప్రభావాన్ని నిరూపించేవారు_ఈ లోకంలో ఈనాడు ఎవరైనా ఉన్నారా?

కేవలం తమ హస్త స్పర్శచేత ఎంతెంత దారుణ బాధలనైనా యిట్టే తొలగించే దివ్య పురుషుని _ ఈ సమాజంలో ఎవరినైనా కన్నారా ?

తమ జీవితాన్ని మానవ సమాజ సంక్షేమానికై సంపూర్ణంగా అంకితం గావించుకొన్నవారిని _ ఈ ప్రపంచంలో ఎవరినైనా ఎరుగుదురా ?

ఎప్పుడూ యిప్పటిమే తప్ప పుచ్చుకోవటం ఎరుగని వారిని _ ఈ జగత్తులో ఎవరినైనా గుర్తించారా ?

బండరాతి గుండెలను కరిగించి, మూగబోయిన నిరాశా నిస్పృహాల హృదయాలను కదిలించి ఉత్తేజపరచే మహనీయుని _ ఈ విశ్వంలో ఈనాడు ఎవరినైనా కనుగొన్నారా ?

ఉన్నారు... ఉన్నారు... వారే భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు. వారే మనకు స్ఫూర్తి ప్రదాత, మార్గదర్శకులు. ( ది 19_11_80 ప్రసంగం నుండి )

# సత్యసాయిబాబా కే చరణోం మే సారే విశ్వహమారా హై!

ఈ సంవత్సరం జరుగుతున్న ఈ మహోత్సవాలు భగవాన్ బాబావారి 65వ జన్మదినోత్సవ మహోత్సవాలే కాక, ఇది అవతార ప్రకటన స్వర్ణోత్సవాలుకూడా ఈ స్వర్ణోత్సవాలు ప్రపంచమంతటా ఎంతో ఉత్సాహంగా జరుపుకొని ఈ ప్రపంచ మహాసభలకు మీరు అందరూ విచ్చేశారు. మీరందరికీ నా స్వాగతం.

ఈ సంవత్సరమంతా విశిష్టమైన సేవలను సాధనగా జరుపుతున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో ఈ సందర్భమున 'దివ్యజ్యోతి' కార్యక్రమం ఎంతో ప్రభావయుతంగా జరిపారు. ఈ సేవా కార్యక్రమాలు మనకొక గొప్ప అవకాశం కలిగించాయి. ఈ సేవలు సమాజంలో పరివర్తనం కలిగించేవిగా వుంటున్నాయి.

(అ. భా. శ్రీ సత్యసాయి సేవాసంస్థల అధ్యక్షులు శ్రీ జి. వి. సత్యనారాయణగారు ది 19-11-1990 న ప్రతినిధులకు స్వాగతం చెబుతూ ఒక చక్కటి గేయాన్ని ఆలాపించి ప్రతినిధులను ఉత్తేజపరిచారు)

బద్రీనాథ్ షిరిడీ కాశీ పర్తీమే తీరథ్ సారే హై
సత్యసాయిబాబాకే చరణోంమే సారే విశ్వ హమారే హై
సబ్ సంతోంమే మహాసంత్ సారీ దునియాసే న్యారే హై
నర్‌నారీ బాలక్ బూఢే సబ్‌హీ కో స్వామీ ప్యారే హై
మూరఖ్ హో యా అజ్ఞానీ పండిత్ హో చాహె విద్వాన్
ఏక్ నజర్ సే దేతే సబ్‌కో దేతేహై వర్‌దాన్
కౌన్ బిగాడ్ సకే ఉసకో జిస్‌కే స్వామి రఖ్‌వాలేహై
సత్యసాయిబాబాకే చరణోంమే సారే విశ్వ హమారా హై
చిత్రావతీ తీర్ పావన్ భూమి ఇసకో కోటి ప్రణామ్ హై
ఇస్‌కే మాటీకే కణ్‌కణ్ పర్ లిఖా ఉస్హీకా నామ్ హై
ఉసకే నిలయమ్‌మే జాకేతో దునియాసే క్యాకామ్ హై
పర్తి హమారే బ్రిందావన్ పర్తిహీ గోలోక్ ధామ్ హై
స్వామి హమారే కృష్ణ కన్హయ్యా స్వామి హమారే
సబ్ కుఛ్ హై
సత్యసాయిబాబాకే చరణోంమే సారే విశ్వహమారా హై

( బద్రీనాథ్, షిరిడీ, కాశీ తీర్థములన్నియూ పర్తిలో ఉన్నాయి. సత్యసాయిబాబా చరణములలో మన విశ్వమంతయూ కలదు. సంత్‌లందరిలో మహాసంత్ సర్వ ప్రపంచమునుండి వేరు. పురుషులు, స్త్రీలు, బాలురు, ముసలివారు అందరూ స్వామిని ప్రేమింతురు. మూర్ఖుడుగాని, అజ్ఞానిగాని, పండితుడుగాని, విద్వాంసుడుగాని, ఒక్క చూపుతో స్వామి అందరికి వరదానం చేస్తారు.

---

స్వామి రక్షణతోవున్న వారిని ఎవరు హాని చేయగలరు? సత్యసాయిబాబా చరణములలో మన విశ్వమంతయూ కలదు. చిత్రావతీ తీర పావనభూమికి కోటి ప్రణామములు. అక్కడ ప్రతి ఇసుక కణంపై స్వామి నామం కలదు. మీ నిలయంలోనికి పోయిన వానికి ప్రపంచంతో ఏమి పని? పర్తి మన బృందావనం, పర్తి మన గోలోక ధామం. స్వామి మన కృష్ణుడు, స్వామి మన సర్వస్వం సత్యసాయిబాబా చరణములలో మన విశ్వమంతయు గలదు )

భగవాన్ ! ఆత్మతృప్తిగా సేవచేసే మహాభాగ్యం మాకు అధికాధికంగా యివ్వండి. మమ్మల్ని మేము ఉద్ధరించుకొనే అవకాశాలను అనేకానేకములుగా ఇవ్వండి మీకు తృప్తి కలిగించే రీతిగా ఎలా సేవ చేయాలో మాకు నేర్పండి. మీరు నేర్పిన ఈ జ్ఞానంతో మేము మా స్థానాలకు వెళ్ళి, మా నిత్యజీవితాల్లో ఆచరించి తరిస్తాం.

( ది 24-11-90 న సమారోప ఉత్సవంలో శ్రీ జి.వి. సత్యనారాయణ మరొక గేయాన్ని ఆలాపించారు )

ఓ! శ్రీ సత్యసాయిబాబా తేరే దుహాయీ బాబా తేరేశరణ్
హమ్ ఆగయె ఓ సాయి హమ్‌తో జనమ్ జనమ్ కా
ఫల్ పాగయే
నా కోయి ఊంచా నాకోయి నీచా తేరే యిస్ దరబార్ మే
జోభీ ఆయె సబ్‌కుచ్ పాయే తేరే నిర్మల్ ప్యార్ మే
ఓ మన్‌మోహన్ మూరత్ వాలె తుమ్ సబ్‌సేహీ నిరాలే
దీనదయాళూ హమ్ ఆగయే, ఓ స్వామీ హమ్‌కో జనమ్॥

( తరువాయి 28వ పేజీలో )

# భగవాన్ బాబావారిని

# మానవమాత్రులుగా భావించకండి!

— రాబర్ట్ బొజానీ [అమెరికా]

భగవాన్ బాబావారిని మానవమాత్రులుగా భావించకండి! వారు 24 గం.లు ప్రతిరోజూ మన బాగుకోసం, మన ఉద్ధరణ కోసం పాటుపడే దయామూర్తి. దారి తెలియని మనకు జీవితగమ్యం వైపు దారి చూపించుతూ, ఏమి చేయాలో తోచకపోతే సలహాలనిస్తూ, మనతో అత్యంత సన్నిహితంగా మెలగవచ్చిన దివ్యమూర్తియే బాబా.

ఈనాడు యావత్ ప్రపంచంలోను ఒక మహోద్యమంగా, ఒక విశ్వవ్యాప్తమైన ఉద్యమంగా భగవాన్ బాబావారి యొక్క సందేశాల ప్రభావం కానవస్తోంది. బాబావారి దివ్య సందేశవాణి ఖండ ఖండాంతరాలలో మారుమ్రోగుతోంది. ఈనాటి మానవాళి ఎదుర్కొంటున్న దుర్భర పరిస్థితులను గమనిస్తే మరొక విషయం తప్పక స్ఫురిస్తుంది. భగవాన్ బాబా అవతరించకపోతే మనం ఏమయ్యేవాళ్ళం? ఎక్కడ ఉండేవాళ్ళం? అసలు భగవాన్ మనల్ని రక్షించటానికే అవతరించారని నా సంపూర్ణ విశ్వాసం. మనల్ని తమ చేతులతో పట్టుకొని ముందుకు నడిపించుతూ గమ్యాన్ని చేర్చటానికే అవతరించారు. అందువల్ల ప్రపంచం అంతటా మానవజాతి మనుగడకే అర్థం, పరమార్థం ఈనాడు గుర్తింపబడకపోయినా, భగవాన్ బాబావారిని ఆశ్రయించిన మనకు మాత్రం ఒక అర్థం తెలిసింది. పరమార్థం మనచేత గుర్తించబడ్డది.

ఇప్పుడు మనం ఏమి చేయాలి? ఏమి చేయనక్కరలేదు. బాబావారితో వారి సమక్షాన్ని అనుభవిస్తూ వుంటే చాలు. (Just be with Him). ఇక్కడ గ్రహించిన వారి దివ్య సందేశాలను మనతో మనవెంట మన దేశాలకు తీసుకుని పోదాం. అదే మనం చేయవలసిన పని. భగవాన్ బాబా సందేశాలను మన నిత్య జీవితాలలో ఆచరణలోనికి తీసుకొనిరావటమే మన కర్తవ్యం. అలా ఆచరించినప్పుడే నిజంగా మనం Happyగా వున్నట్లు గుర్తు. మనం అలా ఆచరించకపోయామా, నిజంగా మనం సుఖానికి నోచుకోనివారమే అవుతాం. తల్లులకు తల్లి అయిన బాబావారి సందేశాలను మనం శిరసావహించాలి, ఆచరించాలి. అప్పుడే మన జీవితాలు సార్థకతను పొందుతాయి.

నేను మొట్టమొదటిసారిగా 1974 సం.లో భగవాన్ బాబావారి సందర్శన భాగ్యం పొందాను. ఆనాడు ఈ ప్రశాంతినిలయంలో ఒక చిన్న మందిరం వుండేది. అది ఈనాడు ప్రపంచ మానవాళిని తనలో యిముడ్చుకోగల ఒక పెద్ద Complex (భవనాల సముదాయం)గా రూపొందింది. ప్రపంచాన్నంతటినీ ఆకర్షిస్తున్నది. ఇక్కడ ప్రపంచంలో మరెక్కడా దొరకని ప్రశాంతి లభిస్తున్నది. ఈ ప్రశాంతినే మనం మనతో తీసుకొని వెళ్ళుదాం.

భగవాన్ బాబా వారంటే ఎవరనుకున్నారు? Nothing but Love. ప్రేమ తప్ప అన్యమైనది ఏదీ బాబావారు కారు. భగవాన్ బాబా మనకు చిన్న తల్లులకు తల్లి, తండ్రులకు తండ్రి. అటువంటి బాబావారి సమక్షంలో మనం ఈ మహాసభలను జరుపుకుంటున్నాం. వివిధ ప్రాంతాలకు, వివిధ మతాలకు చెందిన మనం అందరం ఒకటైపోయి, యిక్కడ బాబా దగ్గర చేరాం. ఇప్పుడు మనం చేయవలసినది ఒక్కటే. ఈ దివ్యశక్తి స్వరూపిణి అయిన బాబావారి నుంచి "రీఛార్జి" చేసుకోవటమే. భగవాన్ మార్గ దర్శకత్వంలో మనం మరింత శక్తివంతమైన బాబా వారి పరికరాలుగా రూపొందటమే. ఈ జన్మలో భగవాన్ బాబావారిని ఆశ్రయించుటకు మించినది మరేదీలేదు. అదే మన అదృష్టం.

( 24-11-90 ప్రసంగం నుండి )

# ప్రేమ వర్షం కురిపించండి!

— రోయి కోహిరా [జపాన్]

ఓ ప్రియతముడైన స్వామీ! మేము మిమ్మల్ని ప్రేమిస్తున్నాం! మేము మిమ్మల్ని ప్రేమిస్తున్నాం!... ఓ భగవాన్! మీ దివ్య సన్నిధికి 98 దేశాల నుండి ఎందరెందరమో వచ్చాం. అయినా కొందరు యిక్కడకు రాలేకపోయారు. వారందరి తరఫున నేను మీకు ప్రణమిల్లుతున్నాను. మాటలు చాలవు, ఆలోచనలు చాలవు, ఎంత చేసినా కూడా మా చేతలూ చాలవు. మీ సమక్షంలో పొందే పరిపూర్ణమైన ఆనందాన్ని అభివర్ణించలేం. మీరు మా కోసం ఎన్నెన్నో చేస్తున్నారు. లక్షలాదిగా తరలివచ్చిన మా కోసం, షెడ్లు కట్టించారు, గుడారాలు (Tents) వేయించారు. ఏ ఒక్క భక్తుడూ తనకు బాధ కలిగినట్లుగా ఫిర్యాదు చేయలేదు. ఎంత దయ! ఎంత కృప! ఇవి విశ్వ మహాసభలు. 98 దేశాల ఏకత్వం యిక్కడ ప్రత్యక్షంగా కనపడుతోంది. ఈ ఏకత్వాను ఫలం మీ అనుగ్రహఫలం. మీరు యిస్తున్న ఉత్తేజఫలం.

ఈ విశ్వ సమ్మేళనంలో పాల్గొనిన మేమంతా మీ దివ్య సందేశాన్ని శ్రద్ధగా వింటున్నాం. మీ దివ్య ప్రబోధాల నుండి మాకు మార్గదర్శక సూత్రాలు లభిస్తున్నాయి. వీటిని మాతో మా వెంట మా దేశాలకు తీసుకొని వెళ్ళతాం. వీటిని అక్షరాలా మా నిత్య జీవితాల్లో ఆచరించి తీరుతాం. ఇక్కడ మీ దివ్యశక్తి చేత పవిత్రన చెందని ఒక్క రాతిముక్క కూడా లేదు స్వామీ! మా అందరికీ మీ సాన్నిధ్యంలో వుండిపోవాలని వుంది. మీ చిరునవ్వు కోసం, మీ పాదస్పర్శ కోసం మా హృదయాలు తహతహ లాడుతున్నాయి.

ఓ స్వామీ! మీ దివ్యకృపను మాపై వర్షించ చేయండి. దానివల్లనే మాకు మీ సందేశాలను ఆచరించే శక్తి లభిస్తుంది. మా దేశం జపాన్. అణుబాంబు దాడులకు ధ్వంసమైపోయిన దేశం. కనుక మాపై ప్రేమ వర్షం కురిపించండి! ప్రపంచ దేశాలు మిమ్మల్ని ఆహ్వానిస్తున్నాయి. తమ దివ్య పాదాలను మోపి మమ్మల్ని పునీతం చేయండి. ఇదే మా ప్రార్థన.

బాబా! మీరు మాలో కొంతమందికి ఆధ్యాత్మిక పరీక్షలు పెడుతున్నారు. ఈ పరీక్షలలో మాకు నెగ్గే శక్తిని కూడా మీరే అనుగ్రహించండి. ఈరోజు ఉదయం వాతావరణం చూస్తే తుఫాన్ వస్తుందనే భయభ్రాంతులు కలిగాయి. కానీ మీ దివ్య కృపచేత తుఫాన్ రాకపోగా చక్కటి, చల్లని ఆహ్లాదకరమైన వాతావరణం అనుభవిస్తున్నాం.

మేమంతా యదార్థానికి మీ కృపకు అయోగ్యులం. మా హృదయాలన్ని బాధతో, బరువుతో కృంగిపోతున్నాయి. మీ అనుగ్రహం కోసం అత్యంత భక్తితో ప్రణమిల్లుతున్నాం. మీ ఆశీస్సులను పొందడానికి ప్రయత్నిస్తున్నాం.

స్వామీ! మా ప్రణతులు అందుకోండి! ఆశీస్సులను అందించండి! అనుగ్రహాన్ని ప్రసాదించండి! మమ్మల్ని పునీతులను గావించండి!

( 24-11-90 ప్రసంగం నుండి )

## మంజువాణి

కోపము సహజంబు లోకాన జనులకు
తగవు పెంచు గతము తలచరాదు
కోప మడచుకొన్న కోటికి పడగెత్తు
మమ్ము బ్రోవుమమ్మ మంజువాణి!

పేదవానినేమొ పేదగా జేసెను
గొప్పవాని నెంతో గౌరవించు
మధ్యవాని నెపుడు మరచేను లోకంబు
మమ్ము బ్రోవుమమ్మ మంజువాణి!

# సమైక్యతా జ్యోతిని చేతబూనాలి

- శ్రీ ఆర్. వెంకట్రామన్
(భారత రాష్ట్రపతి)

ప్రశాంతి నిలయం: ఈనాడు శ్రీ సత్యసాయిబాబావారి దివ్య సాన్నిధ్యం మానవాళిని విభేదాలకు, ఆడంబరాలకూ దూరంగా తీసుకువెళ్తుంది. సాయి సందేశం మానవాళిని ఉద్ధరిస్తోంది. ఇక్కడికి రావటం నా అదృష్టం; ఇక్కడికి వచ్చి వెళ్ళటమంటే ఒక తీర్థక్షేత్రానికి వచ్చివెళ్ళటమే. అంతేకాదు భారతదేశపు సనాతనమైన వారసత్వమైన ఆధ్యాత్మిక సందేశాన్ని పొంది, పునరుజ్జీవనం పొంది తిరిగి వెళ్ళటంగా నేను భావిస్తున్నాను.

మన దేశం అనేకమైన స్థితిగతులను ఎదుర్కొంటూ వచ్చింది. మానవుని ఆధ్యాత్మికమైన ఔన్నత్యాన్నే ప్రధానంగా గుర్తించిన దేశం. సత్యాన్ని పలుకు, ధర్మాన్ని ఆచరించు అనే సందేశాన్ని వ్యాప్తిలోనికితెచ్చిన దేశం ఇది. శాంతికీ, ధర్మానికీ నిలయమైన దేశం.

అత్యంత ఆధునికమైన, సమగ్రమైన ప్రత్యేకమైన శిక్షణతోపాటు భగవాన్ బాబావారి సాన్నిధ్య సామీప్యములు కూడా దక్కిన అదృష్టవంతులు మీరు. పుస్తకాల ద్వారానే కాక భగవాన్ సమక్షం ద్వారా కూడా మీరు ఎంతెంతో నేర్చుకున్నారు. ఇది మీకు అబ్బటం నిజంగా మీ అదృష్టం. ఇంకెక్కడా సాధ్యంకాని రీతిలో ఇక్కడ మీకు విద్య బోధించబడుతోంది.

ఇలాంటి సంస్థ నిర్వహించే ఈ విద్యాలయంలో మీరు పట్టభద్రులై పట్టాలు పుచ్చుకుంటున్నారు. మీలో ప్రతి ఒక్కరూ నడయాడే ఆదర్శ విద్యార్థి (Mobile ideal student) కావాలి. మీరు ఈ ఆధ్యాత్మిక జ్యోతిని ధరించి జీవితంలో ముందుకు సాగిపోవాలని ఆశిస్తున్నాను.

ఎన్నో విద్యాలయాలను చూచాను. కాని ఈ దివ్యమైన వాతావరణాన్ని మరి నేనెక్కడా చూడలేదు. ఇక్కడ అన్నిటికీ మించిన ఒక దైవీశక్తి ఉన్నది. అదే భగవాన్ బాబా దివ్యశక్తి. ఆ శక్తి మిమ్మల్ని సన్మార్గమున నడిపిస్తున్నది. ఈరోజున మీరు డిగ్రీలు తీసుకొని బయట ప్రపంచంలో అడుగుపెడుతున్నారు. మీకు డిగ్రీలు నిచ్చి ఈ స్నాతకోత్సవం వీడ్కోలు చెబుతుంటే, బయట ప్రపంచం మిమ్మల్ని ఆహ్వానిస్తోంది. మీరు యిక్కడ పొందిన దివ్యానుభూతులను, నేర్చుకొనిన విద్యలను నిజ జీవితంలో ఆచరణలో పెట్టి బాహ్య ప్రపంచానికి అందించి, సమాజాన్ని సన్మార్గోన్ముఖంగా తీర్చిదిద్దే ప్రయత్నం చేయాలి.

మతాలపట్ల, ధర్మాలపట్ల వివిధ నమ్మకాలున్నాయి. భగవంతుని గొప్పతనం అన్ని భాషలలోను, వివిధ గొంతుకలతోను కీర్తించబడాలి. ప్రశాంతి నిలయంలో నెలకొలిపిన సర్వధర్మ స్తూపము, సమైక్యతావాదిని ప్రబోధిస్తున్నది. ఇక్కడి ప్రతి విద్యార్థి సమైక్యతా జ్యోతిని చేతబూని సమాజంలో అడుగుపెట్టి వివిధ మత ధర్మాల ప్రజల మధ్య సమన్వయాన్ని సాధించాలి.

(ది 22-11-90న రాష్ట్రపతి చేసిన ప్రసంగం నుండి)

---

( 25వ పేజీ తరువాయి )

నా మాంగే హమ్ హీరేమోతీ నా చాందీ నా సోనా
హమే తుమ్హారీ క్రిపా చాహియే ఔర్ హృదయే కాకోనా
హమ్‌కో హాత్ దయాకా దేనా అపనీ ఛాయామే లేనా
లీలా తుమ్హా హమ్ గాగయే. ఓ స్వామీ హమ్‌తో......

' (ఓ సత్యసాయిబాబా నీ దయవలన మేము నీ శరణు జొచ్చితిమి. మా పూర్వజన్మల ఫలమంతయు మాకు లభించినది. మీ కొలువులో ఎవరూ ఊర్ధ్వస్థానముగాని, అధోస్థానముగాని లేదు. మీ నిర్మల ప్రేమలో వచ్చిన వారందరికీ అన్నియూ లభించుచున్నవి. ఓ మనస్సును మోహింపజేసేటటువంటి రూపము కలవాడా! నీవందరి కన్నా ప్రత్యేకమైనవాడవు. దీనదయాళూ! మేము వచ్చితిమి. ఓ స్వామీ! మా పూర్వజన్మల ఫలం లభించింది. మాకు వజ్రములు, ముత్యములు, వెండి బంగారములు అక్కరలేదు. నీ కృపయే మాకు కావలెను' మీ విశ్వహృదయంలో చిన్న చోటు. మాకు మీ దయా హస్తము నందించి మీ నీడలోనికి తీసుకో. మీ లీలను గానం చేస్తున్నాం. ఓ స్వామీ! మా పూర్వజన్మల ఫలమంతయూ మాకు లభించినది.)

( 3 వ పేజీ తరువాయి )

అని పేరు వుండటంచేతనే గదా ఈ బాలభరతునకు 'భరతా' అని పేరు ఉచ్చరించారు. శకుంతలాదుష్యంతుల కుమారునకు పూర్వమే ఈ 'భరతా' శబ్దము వుండటంచేతనే గదా ఆ కుమారునికి ఈ పేరు పెట్టారు. కనుక 'భరత' అనే పేరు అనాదిగా వుండినటువంటిదే. "సరస్వతి, భగవతి, భారతి" సరస్వతికి ఈ పేరు సార్థకమైనటువంటిది. సరస్వతి అనగా వాగ్ దేవతా స్వరూపిణి. కనుక వాక్ చేత ఉద్భవించిన ప్రతి మానవుడు సహజముగా భరతుడే. కేవలం ఈ దేశమునకు మాత్రమే, ఈ వ్యక్తికి మాత్రమే సంబంధించినటువంటిది కాదు. యావత్ మానవజాతికే ఈ "భరత" అనే శబ్దము అన్వయిస్తుంది. "భ" దివ్యజ్ఞానస్వరూపమునకు "భ" కారమని అర్థము. స్వస్వరూప జ్ఞా "భ". ఈ "భ" అనేటటువంటి దానిని ప్రేమించినటువంటివాడు భరతుడు. కనుక స్వప్రకాశమైన జ్ఞానమును రతించినవాడు భరతుడు. "సంగ్రామం తనోతి ఇతి భారతః" అని దీనికి ఉత్పత్తి స్థానము. అనగా సంగ్రామమునందు కుశలుడైనటువంటివాడు భారతీయుడు. సంగ్రామమనగా ఏమిటి? అనుప్రకృతియొక్క శక్తిని ఆత్మశక్తితో ఎదుర్కొనటము. కనుక ప్రతి మానవుడు కూడనూ తనయందున్న ప్రకృతి శక్తిని దివ్యమైన, భవ్యమైన, నవ్యమైన ఆత్మశక్తితో ఎదుర్కొనేటటువంటి వాడు భారతీయుడు. బలం, భరం, భగతి, విభక్తి అనేటటువంటి నిరుక్తి పదములు. 'బలం' అనగా బ్రహ్మబలం, తేజోబలం, క్షాత్రబలం — ఈ మూర్తులతో కూడినటువంటివాడు "భరతుడు". "భరం" అనగా శ్రుతియందు దీనికి యజ్ఞము అని ఒక అర్థం. "యజ్ఞం ఆత్మం భృతతీ ఇతి భరతః" అనగా యజ్ఞము చేత ఆత్మబలమును పొందేవాడు భారతీయుడు ఆత్మబలమనగా దైవబలమును పొందేటటువంటివాడు భారతీయుడు. కనుక ఏ దేశమువారైన, ఏ కాలమువారైన, ఏ వ్యక్తి అయినా కూడను దీనిని పొందుటకు అధికారి కాగలడు.

భారతదేశము సంపన్న దేశము. నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక సంపత్తికి మూలస్థానము. లౌకిక జీవితమునకు ఇది అన్నపూర్ణవంటిది. ఇట్టి పవిత్రమైన దేశమును యీనాడు మనము బీదదేశముగా భావించుకోవటము ఇది కేవలము భ్రాంతియే. మనది బీద దేశము కాదు. ఇది సంపన్న దేశము. ఇది సంపన్న దేశమే కాకుండిన మొగలాయిలు, తురుష్కులు, ఐరోపావారు దీనిపై ఎందుకు దండెత్తివచ్చారు? కాని సంపద వుండి నప్పటికీ, దానిని మనం సంరక్షించుకోలేకపోతున్నాం. కారణమేమిటి? సర్వసంపదలూ వుంటున్నవి కాని, భారతీయులయందు ఐకమత్యము క్షీణించినది. స్వాతంత్ర్యమును సాధించారుగాని ఐక్యతను సాధించలేదు. ఐక్యత లేకపోవటంచేతనే ఇన్ని అనర్థములకు మూలకారణమైనది భారతదేశము. గజనీ మహమ్మదు భారతదేశములోని పంజాబులో గల నాగరకోటను ముట్టడించి ఏడువందల మణుగుల బంగారమును ఒంటెలపైన ఎత్తుకొనిపోయాడు. అక్కడ నిర్మించబడిన 30 గజముల వెడల్పు, 15 గజముల పొడవు గల రజిత గృహమును పునాదులతో పెకలించి తోడ్కొని తీసుకొనివెళ్ళాడు. ఇలాంటి సంపన్న దేశమునందు మనం జన్మించి కూడనూ, యీ సంపన్న భావమును మనలో ఆవిర్భవించుకోకపోవటం ఇది కేవలం దురదృష్టకరం. ఏ కార్యమునందు చూచిననూ స్వార్థమూ స్వప్రయోజనమే తాండవ మాడుచునే వున్నది. ప్రేమస్వరూపులారా! స్వార్థమును త్యజించాలి. ఐకమత్యమును పెంపొందించాలి. దేశముయొక్క ఐక్యతను, ఆనందాన్ని అనుభవించాలి. దేశముయొక్క ఐక్యతను, ఆనందాన్ని అనుభవించాలి. నిజముగా భారతదేశము ఎంత పవిత్రమైనటువంటిదో మీరు గుర్తించవలసిన అవసరం వున్నది. యీ పవిత్రమైన దేశమునందు లేనటువంటిది ఒక్కటి కూడనూ లేదు. "ఎన్న భారతే

తన్న భారత్తాన్" భారత దేశమునందు లేనటువంటి యొక్క వస్తువునుకాని,సంప్రదాయమునుకాని, సంస్కృతిని కాని మరే దేశమునందునూ చూడలేము. ఇలాంటి భారత దేశమునందు సర్వశక్తిని కలిగివుండికూడను నిశ్శక్తులుగా మనము భావిస్తున్నాము. ఇది కేవలం మన భ్రాంతి మాత్రమే. యీ భ్రాంతిని దూరం చేసినప్పుడే మనకు నిజమైనటువంటి ఆత్మానందము లభ్యమవుతుంది. భ్రమను దూరం చేసినప్పుడే బ్రహ్మ మనకు సాక్షాత్కారమవుతాడి.

భారతదేశమను భాగ్యము మనకుండ
ఇతర శక్తులు మనము కోరనేల ?
హైందవ ధర్మ హిమాద్రులు మనకుండ
క్షీరసాగరమును కోరనేల ?

సర్వమును భారత దేశమునందు ఆవిర్భవించి వున్నది. కనుక భారతీయురై పుట్టి......

భరతమాత ధర్మభాగ్యంబు కాపాడ
భారమంతయు మీదే భాగ్యులారా !

ఈ భారత దేశముయొక్క భాగ్యమును కాపాడటానికి ప్రతి భక్తుడును కూడను కంకణం కట్టుకోవాలి.

ఏనుగెట్టుల తన బలము ఎరుగలేదో
అట్టులైనారు మన భారతీయులు నేడు.

సర్వశక్తి సంపన్నులైనటువంటి భారతీయుడు తన తత్వాన్ని తాను గుర్తించుకోలేక పోవటం చేతనేఒక్క మావటీ వానికి వశమైనటువంటి ఏనుగువలె మనము చిక్కిపోవుచున్నాము. ఇలాంటి బలహీనతలను మనం దూరం చేసుకోవాలి. భారత దేశమునందు అనేకమంది మహనీయులు జన్మించారు. అనేక విధములైనటువంటి బోధనలు సల్పారు.

ఖండ ఖండాతర ఖ్యాతి నార్జించిన
మహనీయులను గన్న మాతృభూమి
పాశ్చాత్య వీరుల పారద్రోలించియు
స్వాతంత్ర్యమును గన్న సమరభూమి
పాండిత్యమున ఘాల ప్రఖ్యాతి గాంచియు
ప్రతిభ చూపించిన భారతభూమి
సంగీత సాహిత్య శాస్త్రములు విద్యల
ధీశక్తి చూపిన దివ్యభూమి.

ఇలాంటి పవిత్రమైనటువంటి దివ్య భూమియందు మానవులై జన్మించి కూడనూ ఈ దివ్యమైనటువంటి పవిత్రతను మనం గుర్తించలేకపోతున్నాము ఇది కేవలం ఒక దురదృష్టమే.

భావం లేని మాన
మాతృదేశము కన్న

అటువంటి పవిత్ర దేశమునందు మనం జన్మించి ఈ మాతృభావంతో మాతృదేశాన్ని మనం ప్రేమించలేక పోతున్నాం. దేశాన్ని ప్రేమించాలి. దేశ క్షేమాన్ని ఆశించాలి. ఆ దేశ రక్షణ నిమిత్తమై మనం మన జీవితాలను అంకితం చేయాలి. దీనికి ఐకమత్యం అత్యావసరం. మహనీయుల యొక్క జన్మదినములను మనం జరుపుతుంటున్నామే కాని, మహనీయుల వాక్యాలను ఏమాత్రం మనం అనుసరించటానికి ప్రయత్నించటం లేదు. జన్మదినములు చేసుకోవటం గొప్పతనం కాదు. ధన్యజన్ములైన వారి దివ్య భావములను అర్థం చేసుకొని వర్తించటానికి ప్రయత్నించాలి. ప్రేమ తత్వాన్ని మనం పెంచుకోవాలి. జీవితమంతా ప్రేమ మయంగా మార్చుకోవాలి. కనుకనే ఆనాటి ద్వాపర యుగమునందు గోపికలు ప్రేమతత్వాన్ని అభివృద్ధి పరచుకొని కృష్ణామృతమును గ్రోలినారు. ప్రేమలేని జీవితం కేవలం ఒక నిరుపయోగమైనటువంటి తిత్తి వంటిది. మానవుడు ప్రేమస్వరూపుడు. ఈ ప్రేమను మనము సత్యరూపమైన రీతిగా మరల్చుకోవాలి. ఈ ప్రేమనే మానవులకు ప్రాణము.

దివ్యాత్మస్వరూపులారా :

దివ్యమైనటువంటి భగవత్ తత్వాన్ని మనం ప్రేమగా భావించి, ప్రేమచేత సమాజసేవలో పాల్గొనాలి. భారత

ఈ పుట్టపర్తి ఒక చిన్న కుగ్రామం. ఈ గ్రామం ఇంతటి స్థాయికి రావటానికి కారణమేమిటి? అని ఎవరికివారు యోచించుకోవచ్చు. ఇది ఒక యోగమని కాని, ఇది ఒక భాగ్యమనికాని, ఇది ఒక అదృష్టమని కాని భావించరాదు. ఇది కేవలం మానవునియొక్క సంకల్పసిద్ధులే. పవిత్రమైన సంకల్పమే పవిత్రమైన దానిని సిద్ధింపజేస్తుంది. వేదాంతం “యద్భావం తద్భవతి” అని చెప్పింది. కనుక ప్రతి మానవుడు సద్భావాన్ని పెంచుకోవాలి. అప్పుడే సరియైన ఫలము లను అందుకోవటానికి అధికారి అవుతాడు. ఈ ప్రశాంతి నిలయమందు మీకు తగినటువంటి వసతులు లేకపోయినప్పటికినీ, ఏదోవిధంగా సరిపెట్టుకొని వుండ టానికి తగినటువంటి ఒక ఉపాయము, ఒక యోగము ఏర్పడింది. ఇదే ఒక గొప్ప సాధనగా మనం భావిం చాలి. సర్వసుఖములూ వుండినటువంటిది సాధన కానేరదు. కష్టములందే మనకు సుఖము లభిస్తుంది. “క్లేశేఫలి” కష్టము లేకుండా ఫలము లభించదు. ఈ కష్టమనేది తపస్సుగా మనం మార్చుకోవాలి. సుఖములో తమస్సు పెరుగుతుందిగాని తపస్సు పెరగదు. ఇన్ని శ్రమలకు మీరు ఓర్చి ఇన్ని లక్షలమంది ఈ ప్రదే శంలో యిమిడి వుంటున్నారంటే ఇదే నిజమైనటువంటి ఏకత్వానికి సరియైనటువంటి చిహ్నం. అయితే ప్రతి దానికీ నీ పురుష ప్రయత్నం అత్యవసరం. పురుష ప్రయత్నం లేకుండా ఏ చిన్న కార్యాన్నికూడా మనం సాధించలేం. ఈ ప్రశాంతి నిలయమునకు నిత్యమూ వచ్చిపోయే వేలాదిమంది భక్తులకు తగిన సౌకర్యము లేర్పర్చి, అనేక విధముల శ్రమకోర్చి ప్రశాంతి నిలయంయొక్క రూపురేఖలను మార్చిన వ్యక్తి ‘జోగా రావు’. ఇతను కర్మయోగి. కర్మయందే అతనికి చాలా ఆనందం. ఇతను కర్నల్ జోగారావు కాదు. అందరూ “కర్మజోగి” అంటారుగాని నేనుమాత్రం “కర్మయోగి” అంటాను. ఇలాంటి కర్మయోగులు భారతదేశమునందు అభివృద్ధి గావాలి. ప్రతి వ్యక్తి కూడను ఒక “కర్మయోగి”గా మారాలి. ఆ కర్మయే ధర్మంగా రూపొందుతుంది. ఆ ధర్మమే జన్మమున్ను సార్థకం గావిస్తుంది. కనుక [illegible] హృదయము నందుంచుకొని కర్మయోగంలో మునిగి దివ్య మైన జీవితాన్ని ధన్యం గావించుకోవటం ప్రతి ఒక్కరి కర్తవ్యమని మనం విశ్వసించాలి.

భారతదేశం యొక్క పవిత్రతను మనం ఏనాడూ మరువరాదు. భారత [illegible] కాదు. ఈ సత్యాన్ని గుర్తించలేకపోవటం చేతనే దేశంలో అనేక విధములైన అల్లకల్లోలములు కలుగు తున్నాయి. [illegible] కేవలం [illegible] అనుమార్గముల ననుసరిస్తున్నారు. [illegible] అధికమైన [illegible] మనం కోల్పోతున్నాం. స్వతంత్రం పొందిన సమయ ములో 13% మాత్రమే ‘బ్యాక్‌వర్డ్ క్లాస్’ అనేటటు వంటిది. పెరుగుతూ పెరుగుతూ ఇప్పుడు 80% ‘బ్యాక్ వర్డ్ క్లాస్’గా అయిపోయింది. ఇంకా 5, 7 సం. అయి పోతే 100% ‘బ్యాక్‌వర్డ్ క్లాస్’ కావచ్చు. ఇది సరియై నటువంటి [illegible]. భారత [illegible] కాదు. ఈ అల్పానుమానములు [illegible] ఇలాంటి పేరును మనం అభివృద్ధి గావించుకోవటం చేత [illegible] యులు మన భారతదేశమును [illegible] భావిస్తున్నారు.

భారతదేశం ఒక సంపన్న దేశం. [illegible] ఉండినటువంటి భాగ్యం ఏ దేశమునకు లేదు. అలాంటి సంపదను మనం కలిగియుండికూడా [illegible] దేశంగా మనం పేర్కొనబడుతున్నాం? ఇంకా ఇంతేగాదు. మన విద్యా వైద్య విషయాలయందు కూడనూ తగిన త్యాగ మును అభివృద్ధి పరచుకోవాలి. మీ కందరికీ తెలుసు. ఒక నెల ముందుగానే ఎంతోమంది విద్యార్థులు ప్రాణ ములు కోల్పోయినారు. దీనికి కారణమేమిటి? దీని కంతటికీ కూడను కారణం వారికి ఏదో కొన్ని రకము

మైన గ్రేడులు యివ్వ నిమిత్తమై ఈ విధమైన అవస్థలకు గురి గావించినారు. విద్యను స్వేచ్ఛగా, ఉచితంగా అందరికీ అందించే మార్గాన్ని మనం అభివృద్ధిపరచాలి. స్వతంత్ర ప్రతిపత్తిగల సంస్థ అధీనంలో విద్యారంగము వుండాలి. ఉచిత విద్యను అందరికీ అందుబాటులో వుంచాలి. అప్పుడు విద్యార్థుల యందు ఈ విధమైన సమస్యలు ఏమాత్రం ఉత్పన్నం కావు. ఇక్కడ రాష్ట్రపతిగారు, ముఖ్యమంత్రిగారు, గవర్నరుగారు వున్నారు. వీరు ముందు జాతివారు, వీరు వెనుక జాతివారు అని ఎట్టి తారతమ్యం లేకుండా అందరికీ ఫీజులు లేకుండా ఉచిత విద్య నందించాలి. పేదలకుగాని, పెద్దలకు గాని, శ్రీమంతులకుగాని అందరికీ ఉచిత విద్య (Free Education) అందించేటటువంటి మార్గాన్ని మనం చేపట్టినప్పుడు దేశం ఎంతో బాగుపడుతుంది. ప్రతి ఆధ్యాత్మిక సంస్థ ఈ విషయమై ప్రత్యేకశ్రద్ధను తీసుకోవాలి. ఉచిత విద్యను అందించటానికి ప్రతి స్వచ్ఛంద సంస్థ ముందుకు రావాలి. తిరుపతిలో కావల్సినంత ధనం ప్రోగవుతూ వుంటుంది. అక్కడ విద్యాసంస్థలలో ఎందుకు ఉచిత విద్య యివ్వకూడదు? ఎన్ని కోట్లు వ్యర్థమైపోతున్నాయి? స్వేచ్ఛగా ఉచిత విద్యా వైద్యములు అందరికీ అందించాలి. మేము నిన్నటి దినమే ఒక పెద్ద వైద్యాలయమునకు శంకుస్థాపన చేశాం. 100 కోట్ల రూపాయల వ్యయంతో ఒక పెద్ద వైద్యాలయమును నిర్మించి 1991 నవంబర్ 22వ తేదీకి ప్రారంభోత్సవం చేస్తాం. దీనిలో బైపాస్ ఆపరేషన్ గాని, కిడ్నీ మార్పిడిగాని, లంగ్స్ ఆపరేషన్‌గాని, బ్రైన్ ఆపరేషన్‌గానీ – అన్నీ ఉచితముగానే చేయబడుతాయి. సాయి సంకల్పమనేదానిని ఎవ్వరూకూడను అర్థంచేసుకోలేరు. సంకల్పం, క్రియ రెండు కూడను ఒకే పర్యాయం జరుగుతుంది. ఇది ఎలాంటిదంటే తుపాకి కాల్చినప్పుడు శబ్దము, ఏటు రెండూ ఒకేసారి జరుగుతాయి. కనుక సాయి సంకల్పాన్ని అర్థం చేసుకోవాలంటే, యిది అందరికీ సాధ్యంకాదు.

# శ్రీసాయివాణి

* వ్రాతను తప్పించుకోవాలి, ప్రాప్తిని తెప్పించుకోవాలి.
* విచక్షణ లేనివాడే గ్రుడ్డివాడు.
* విత్తం సంసారమునకు, చిత్తం భగవంతునకు అప్పజెప్పు.

  విద్య గుణార్జనకు – ధనార్జనకు కాదు.

  విద్యార్థులు విషయార్థులు కారాదు.

  విశ్వాసమే నీ శ్వాసగా భావించు.

  విశ్వాసం లేనివారికే విచారము.

  విషయశుద్ధి కన్న, హృదయ శుద్ధి ప్రధానం.
* విష్ణు వాంఛ గోపి, విషయ వాంఛ పాపి.
* విషయ వాంఛలను విష్ణు వాంఛలుగా మార్చండి.

ప్రేమ స్వరూపులారా!

ఇది ఒక అతిశయోక్తిగా చెబుతున్నానని మీరు భావించరాదు. నాలో ఏ యొక్క కొనయందుకూడనూ స్వార్థమనేది లేదు. నేను ఏది చేసినా పరుల నిమిత్తమే చేస్తున్నాను. మీరు పరులని నేను భావించటంలేదు. అందరూ నావారే...నావారే...ఇట్టి విశాల భావమునేటటువంటి ప్రపంచమునేకాదు ఎక్కడ చూచినా కాని ఎక్కడా మీకు చిక్కదు. ఒక్క 50 సంవత్సరముల లోపల ఇంత అభివృద్ధి గావించిన సంస్థ మీరెక్కడన్నా చూచారా? ఏ అవతారమందైనప్పటికినీ, ఆ అవతారమును ముగించిన తరువాతనే అభివృద్ధులు పెరుగుతూ వచ్చాయి. ఈ జీవితకాలమందే ఒక యూనివర్శిటీ, విమానకేంద్రం, పెద్ద హాస్పిటల్ – ఇన్ని స్థాపించి ఈ పల్లెలవారికి ఇన్ని సౌకర్యములు ఏర్పాటుచేయటం

## సాహిత్యం

గతంలో వచ్చిన
సాహిత్యం
శిరమెత్తి
అడుగు వేసేది
ఆదర్శం వైపు -
ప్రస్తుతం వస్తున్న
సాహిత్యం
శివమెత్తి
పరుగెత్తుతోంది
ఆకర్షణ వైపు—

— బొగ్గరపు రాధాకృష్ణమూర్తి

జరిగింది. ఇది మాత్రమే కాదు. ఇంకా ఎన్నో మున్ముందు మీరే చూడబోతారు. అనేకమందికి ఇన్ని ఎలా జరుగుతున్నాయాయని సందేహాలు. ఈ శరీరానికి 65 సం. ప్రారంభమైంది. ఇంతవరకూ ఎప్పుడూ, ఎక్కడా, ఎవరిని నా చేయి ఇట్లా చాచలేదు. ఎవ్వరినీ నేను అడుగలేదు. అడుగను, అడుగబోను, అడుగ లేదు. అయితే ఇది ఎట్లా జరుగుతుండాలి? మంచి కార్యానికి భారతదేశమునందు ఏమాత్రం కూడనూ అడ్డులేదు. హృదయ పూర్వకంగా మంచి చేయాలంటే కనకవర్షం కురుస్తుంది. సంకుచితమైన భావములచేత కర్మలలో ప్రవేశించిన వారికి ఎన్ని చేసినా అవి ఏమాత్రం తృప్తి నందించవు. విశాలమైన హృదయం. ఇంత విశాలమైన హృదయాన్ని సంకుచితమైన హృదయాలు ఏవిధంగా అర్థం చేసుకోగలవు?

నేను మిమ్మల్ని ఏమీ ఆశించటంలేదు, అడుగటం లేదు. ప్రేమతత్వాన్ని పెంచుకోండి. అందరూ భగవంతుని బిడ్డలుగా మీరు విశ్వసించండి. ఎవ్వరి యందును ద్వేషమునుగాని, అసూయనుగాని అభివృద్ధి పరచుకోకండి. ఎవ్వరి మనస్సునూ నొప్పించకండి. ఆ విధమైన విశాలభావమే మన హృదయానికి విశాల ఆనందాన్ని అందిస్తుంది. నేడు స్వామి యొక్క జన్మ దినాన్ని చేసుకుంటున్నారంటే, నాకు మీరందరూ అందించవలసింది ఒక్కటే. ఐకమత్యంగా వుండండి. భారతదేశము యొక్క ప్రాచీన సంప్రదాయాన్ని తిరిగి మీరు అభివృద్ధిగావించండి. నేను యిక్కడకు వచ్చే సమయంలో అనేకమంది Happy Birth Day అన్నారు. నేను ఎప్పుడూ Happy గానే ఉన్నాను. Happy లేనివారికి Happy Birth Day చెప్పండి. నాకు విచారమనేటటువంటిదే లేదు. కారణం? అన్నీ అనిశ్చయములే. అన్నీ కదిలిపోయే మేఘములే. దీనికి విచారణచేసి ప్రయోజనం ఏమిటి? జనన మరణాలకు మనం ఏమాత్రం చింతించరాదు, క్రుంగకూడదు, పొంగకూడదు. మనం పుట్టిన సమయంలో ఇంత వస్త్రమునయినా తీసుకొనిరాము. మనం పోయే సమయంలో మన వారికి మన Address (చిరునామా) ఇచ్చిపోము. ఇక వారు మనవారెట్లవుతారు? కనుక ఇవన్నీ కూడనూ జగత్ యొక్క పరిణామములే. ఉన్నంతవరకునూ అందరూ కలిసి మెలిసి ఆనందంగా జీవితాన్ని గడపాలి. ఒక్క భగవత్ చింతనచే సర్వ బాధలను నివారణ గావించుకోవచ్చు. భగవంతుని విశ్వసించండి! జాతి మత భేదములను ఏమాత్రం అభివృద్ధి గావించుకోకండి. అన్ని నామములు, అన్ని రూపములు భగవంతునివే. కనుక ఇట్టి దివ్యమైన భావాన్ని, విశ్వాసాన్ని పెంచుకొని దివ్య నామాన్ని స్మరించి జీవితాన్ని ధన్యం గావించుకోకండి!

(భగవాన్ బాబావారి జన్మదిన సందేశం ది 23-11-90)

# గ్రంథాలయ పితామహ
# అయ్యంకి వెంకటరమణయ్య

**1990** జూలై 24వ తేదీనుంచి గ్రంథాలయ పితామహ అయ్యంకి వెంకటరమణయ్యగారి శత జయంతి ఉత్సవాలు ప్రారంభం కానున్నాయి. ఈ ఉత్సవాలు ఏడాది కాలం జరుగుతాయి. ఈ ఉత్సవాల కాలంలో గ్రంథాలయోద్యమం వాడవాడలా వ్యాపించడానికి అన్ని ప్రయత్నాలు జరుగుతాయి.

ఈ ఉత్సవాలకు కారణభూతమైన అయ్యంకి ఒక వ్యక్తి కాదు. ఒక శక్తి, ఒక ఉద్యమ స్వరూపం, జీవించిన 89 సంవత్సరాల కాలంలో దాదాపు, డెబ్బయి సంవత్సరాలు ప్రజా ఉద్యమాలలో పని చేశారు. గ్రంథాలయోద్యమం కేంద్రంగా చేసుకుని జాతీయోద్యమం, సహకారోద్యమం, హరిజన ఉద్యమం, ప్రకృతి ఉద్యమం బ్రహ్మజ్ఞాన సమాజం మొదలైన అనేక ఉద్యమాలలో కృషి చేశారు. వనరులు సాధనాలు పెద్దగా లేక పోయినా ఉత్సాహమే పెట్టుబడిగా, త్యాగనిరతి శ్రమ శక్తిగా ప్రజాసేవ పరమావధిగా చివరి నిముషం వరకు కృషి చేశారు.

దేశంలో గ్రంథాలయాలకు ఒక సంఘంలేని దినాలలో 1914 లోనే ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాన్ని స్థాపించారు.

భారతీయ భాషలలో గ్రంథాలయరంగంలో తొలి పత్రికగా "గ్రంథాలయ సర్వస్వము" పత్రికను 1915 లో ప్రారంభించారు.

1919 లో జాతీయస్థాయిలో అఖిల భారత పౌర గ్రంథాలయ సంఘాన్ని స్థాపించారు. ఈ సంఘానికి అయ్యంకి వారే కార్యదర్శి. దీని కేంద్రస్థానం విజయవాడ.

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం తరఫున అయ్యంకి వారు అనేక కార్యక్రమాలు నిర్వహించారు. గ్రంథాలయోద్యమ ప్రచారానికి రాష్ట్రస్థాయిలో, జిల్లా స్థాయిలో, శాఖా స్థాయిలో అనేక సభలు, సమావేశాలు నిర్వహించారు. 1921 నుంచి అనేక పర్యాయాలు గ్రంథాలయ కార్యకర్తలకు శిక్షణ తరగతులు నిర్వహించారు. దేశంలోకెల్లా అపూర్వమైన రీతిలో ఉభయ గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలో గ్రంథాలయ యాత్రలు నిర్వహించారు. భారతదేశంలో ఏ గ్రంథాలయ కార్యకర్త దర్శించనన్ని గ్రామాలు వేల సంఖ్యలో సొంత ఖర్చులతో దర్శించారు. అనేక గ్రామాలకు కాలినడకనే వెళ్ళారు.

### డాక్టర్ వెలగా వెంకటప్పయ్య

అయ్యంకి వారి సేవలను ప్రజలు, ప్రభుత్వం గుర్తించాయి. ఆంధ్రప్రదేశ్ మాజీ ఆస్థానకవి కాశీ కృష్ణాచార్యులు అయ్యంకి వారిని 'శర పురుషులు' అని ఆశీర్వదించారు. షష్టిపూర్తి సందర్భంలో సర్ సి.ఆర్. రెడ్డి వారిని 1942లో "గ్రంథాలయ పితామహ" బిరుదుతో సత్కరించారు. 1972లో భారత ప్రభుత్వం వారిని "పద్మశ్రీ" గౌరవంలో సత్కరించింది. 1979 కౌలా అంతర్జాతీయ స్వర్ణ పతకాన్ని అందుకున్నారు.

ఇలా అయ్యంకి వారిని గురించి ఎంతో చెప్పుకో వచ్చు. వారు జీవించినంత కాలం ప్రతి నిముషం, ప్రతి గంట, ప్రతి రోజు, ప్రతి మాసం గ్రంథాలయాల కోసం వెచ్చించారు. ఇన్ని సంవత్సరాలపాటు ఇంత విస్తృతంగా గ్రంథాలయ రంగంలో కృషి చేసిన వ్యక్తి అయ్యంకిని మించినవారు లేరు. ఇది తెలుగు వారి అదృష్టం.

-0-

నాణ్యతకు !　　　　　　　　　　　　　　　సరసమైన ధరలకు!

# లక్ష్మీ జనరల్ స్టోర్సు

## గవర్నరుపేట, విజయవాడ-520 002

గ్యారంటీ వెండి జరీ కంచి, ఆరణి, ధర్మవరం చీరలకు

టెస్టెడ్ జరీ, బెంగుళూరు, బెనారస్ పట్టు చీరలకు

మరియు

టెరీన్, సూటింగులు, షర్టింగులకు

మా ప్రత్యేకత

చేనేత చీరెలు, ధోవతులు, లుంగీలు, టవల్సు

బెడ్‌షీట్సు, దుప్పట్లు సరసమైన ధరలకు లభించును.

దర్శించండి !　　　　కొనండి !　　　　ఆనందించండి !

# శ్రీవాణి 7వ జన్మదిన ప్రత్యేక సంచిక

## జనవరి 1991 (2వ వారంలో) వెలువడుతుంది

* ప్రముఖుల సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక వ్యాసములు కవితలు, కథలు మరెన్నో విజ్ఞాన విశేషాలతో 125 పేజీలతో వెలువడుతుంది "ప్రత్యేక సంచిక".

* భగవాన్ బాబా 65వ జన్మదినోత్సవ వేడుకలు, స్వర్ణోత్సవ విశేషాలు, ప్రముఖుల ప్రసంగాలు, కలర్ ఫోటోలు, బాబావారి దివ్య సందేశములు, ఇంకా ఎన్నో...ఎన్నో విశేషాలతో వెలువడుతుంది "ప్రత్యేక సంచిక".

## ప్రత్యేక సంచిక వెల: రు. 10-00

* క్రొత్తగా చేరే చందాదారులకు "సనాతన విజ్ఞానం" పుస్తకం ఉచితంగా పంపబడుతుంది.

ముఖ్య గమనిక : సంవత్సర చందా రు. 42-00 లు పంపినవారు పై అవకాశమును పొందుటకు అధికంగా ఏమీ పంపనవసరం లేదు.

**చందాలు రెన్యూవల్ చేయవలసినవారు వెంటనే చేయండి !**

**క్రొత్త చందాలను వెంటనే పంపండి ! త్వరపడండి !**

**ఈ అవకాశమును సద్వినియోగం చేసుకోండి !**

ఆర్థిక స్తోమత కలిగిన పాఠకులు జీవిత సభ్యత్వంగాని, 4 సం॥ చందాగాని పంపి "శ్రీవాణి"ని ప్రోత్సహించమని మనవి చేస్తున్నాము.

సం॥ చందా : రు. 42-00, 4 సం॥ చందా : రు. 150-00, జీవిత సభ్యత్వము రు. 600-00. జీవిత సభ్యుల ఫోటోలు శ్రీవాణి 7వ జన్మదిన ప్రత్యేక సంచికలో ముద్రించబడుతాయి.

ప్రకటన ధరల పట్టిక

| | |
|---|---|
| పూర్తి పేజి ( డీలక్స్ ) | రు. 1000-00 |
| పూర్తి పేజి ( ఆర్డినరి ) | రు. 600-00 |
| 1/2 పేజి ( ,, ) | రు. 300-00 |

— మేనేజర్

" నేను సాయినని తెలియుము నిక్కముగను
మమత, కాయము, యత్నముల్ మానుకొమ్ము
కాదు నీకు నాతోటి సంబంధమింక
కాదు నన్ను పట్టుట ఎంతటి ఘనులకైన "

స్కూలు నుంచి తిరిగి ఇంటికి వచ్చిన 'సత్య' పలికిన పలుకులివి. ఇంటి గడపపై నిలబడి, పుస్తకములు పారవైచి, బిగ్గరగా " నేను మీ సత్యను కాదు. నేను సాయిబాబాను. నేను వెళ్ళుచున్నాను. నేను మీ వాడను కాదు. మాయ వీడినది. నా భక్తులు నన్ను పిలుచుచున్నారు. నేను సంకల్పించుకొని వచ్చిన కర్మమును ప్రారంభించవలసియున్నది. ఇంక నొక్క క్షణమైనను నింట నుండజాలను." అని వెడలుచుండగా అన్నగారు శేషమరాజు పరుగెత్తుకుని రాగా " నీవు నన్ను బాగుపరచు నుపాయములు మానుము. నేను సాయిబాబాను. మీతో నాకేమీ సంబంధం లేదు." అని చెప్పి అబ్కారి ఇన్‌స్పెక్టర్ బంగళాతోటలోని ఒక రాతిపై బాలసాయి వెళ్ళి కూర్చొనెను. అప్పుడు బాబా చుట్టూ భక్తులు చేరగా " మానస భజరే గురుచరణం దుస్తర భవ సాగర తరణం" అను పాటను తొలి ప్రార్థనగా అక్కడ చేరిన అందరిచేత మన బాలసాయి దిక్కులు పిక్కటిల్లునట్లు పాడించెను. ఆ శుభదినం 1940 సం. అక్టోబర్ 20వ తేది. భగవాన్ బాబావారు తన దివ్యావతారమును గురించి ప్రకటించిన దినమది.

స్వామి అవతార ప్రకటనచేసి యాభై సంవత్సరములు అయిన సందర్భమున స్వర్ణోత్సవ వేడుకలు, 65వ జన్మదినోత్సవ మహోత్సవములు జరుగుచున్న ఈ శుభసమయమున భగవాన్ బాబా పలికిన పసిడి పలుకులను 'శ్రీవాణి' భక్తితో భక్తులకు 10 వేల ప్రతులను సమర్పించుకుంటున్నది. చదవండి ! చదివించండి ! తరించండి ! తరింపజేయండి.

సదా సాయి సేవలో
కొమరగిరి కృష్ణమోహనరావు
ఎడిటర్ " శ్రీవాణి "

# వందనం.... అభివందనం....

వందనం... అభివందనం...
సత్యసాయికి వందనం...

గ్రామసేవే రామసేవని
వేదసారం విప్పిచెప్పి
మానవునిలో మాధవుని చూపిన
వేదమూర్తికి వందనం...

ప్రేమతత్వం ప్రబోధించి
మమత సమతలు పొందుపరచి
మానవత్వం విలువ తెలిపిన
ప్రేమమూర్తికి వందనం...

భక్తిమార్గం బోధచేసి
రక్తిలోని మాయ తెలిపి
శిష్యకోటికి దారి చూపిన
సనాతన సారథికి వందనం...

మోక్షమంటే వేరులేదని
సేవ ద్వారా పొందవచ్చుని
ముక్తిమార్గం చూపిన
పురాణ పురుషునికి వందనం...

ఆర్తునకు అనార్తునకు
యోగికి మరి భోగికి
జ్ఞానమార్గం చూపిన
జ్ఞానదేవునికి వందనం...

కూటికోసం విద్య కాదని
ప్రజ్ఞకోసం చదువుకోమని
చదువు మర్మం ఎరుకపరచిన
గురుదేవులకు వందనం...

సత్య ధర్మం శాంతి ప్రేమలు
విశ్వశాంతికి మూలమంటూ
దివి నుండి భువికి దిగివచ్చిన
పర్తీశ్వరునికి వందనం...

— కొమరగిరి

—***—

## సాయి సూక్తులు

" మనసులో నున్న భావంబు మంచిదైన
కలిగితీరును ఫలసిద్ధి కార్యమందు
మనసులో నున్న భావంబు మలినమైన
ఫలము కూడ నారీతిగ మలినమగును. "

# అవతార తత్త్వము

అఖిల మానవులకు నానందమొసగూర్చి
రక్షించుచుండుటే దీక్ష నాకు
సన్మార్గమును వీడి చరియించువారిని
చేబట్టి కాపాడుటే వ్రతము నాకు
బీదసాదలకైన పెనుబాధ తొలగించి
లేమిని బాపుటే ప్రేమ నాకు
నియమ నిష్ఠలతోడ నను గొల్చువారిని
కాపాడుచుండుటే ఘనత నాకు
మంచి చెడ్డలు కూడ సమముగా భావించి
జీవించుచుండుటే భక్తి నాకు
అనగ బేరొంది నాయందు నలరువారి
నెన్నడును మరువనివాడ నన్నమాట
నెట్టి కుచితము మదికి నే నేర్పకుందు
అట్టి నా పేరు చెడుట యెట్లగును భువిని.

— బాబా

" సాధనము చేసి పనియేమి శమము లేక
యోగమును పూని ఫలమేమి ఓర్పు లేక
జపము చేసియు ఫలమేమి శాంతి లేక
చవిటి భూమిని దున్నిన ఛాయ కాదె, "

# సత్యసాయి షట్చక్రవర్తి

ఏ గుణంబు గణించి ఏతెంచెనో నాడు
ప్రహ్లాదు పాలింప పరమ పురుష
ఏ గుణంబు గణించి ఏతెంచెనో నాడు
కరినిఁగాచెడు తఱి కమలనయనుడు
ఏ గుణంబు గణించి ఏతెంచెనో నాడు
పేద కుచేలుని బ్రోవ వేదచరితుడు
ఏ గుణంబు గణించి ఏతెంచెనో నాడు
ధృవకుమారుని సాక వైకుంఠవాసి

ఆ గుణంబె గణించి అమరవంద్యు
డార్తజనుల పాలింప నవతరించె
అనాథనాథ లోకనాథ సచ్చితానందమూర్తి
పుట్టపర్తి సత్యసాయి షట్చక్రవర్తి.

— బాబా



" కోపవంతుని కూడ కూర్మితో కానవచ్చు
పాము ప్రక్కనైన పండవచ్చు
మత్సరంబుగల మనిషితో కూడిన
మానవత్వము నాడు మంటయగును. "

# చిన్మయ మూర్తి

చెంత చేరెనటంచు సంతసించెదరన్న
వెంటనే ఎడబాటు చింతగూర్చు
ఏడిపించుచొ సాయి వేడుకయుందురా
కడుపుబ్బ నవ్వించు నడుమ నడుమ
పొగడుచున్నారని పొంగిపోయెదరేమో
తప్పకప్పుడె ఎగతాళిసేయు
అభయమిచ్చెను గాన హాయిగ నుండెదరన్న
పడు బాధలకు అంతు పట్టకుండు
వెనుకకేగనీడు చననీడు ముందుకు
మనసు మరులు గొల్పి మథనబెట్టు
అట్టి చిన్నిసాయి చిన్మయమూర్తిని
ఎట్టులెరుగ గలరు ఇలను మీరు.

బాబా



" గుణము లేని సుతుడు గురి లేని విద్యలు
నీతిలేని జాతి నిష్ఫలంబు
శాంతిలేని జీవి శశిలేని నిశి సుమీ
వినుము భారతీయ వీరసుతుడ. "

# పట్టు నెగ్గెడుదాక

పట్టినదేదియో పట్టనే పట్టితివి
పట్టు నెగ్గెడుదాక అట్టెయుండు
కోరినదేదియో కోరనే కోరితివి
కోర్కె చెల్లెడుదాక కొలిచియుండు
అడిగినదేదియో అడుగనే అడిగితివి
అడిగినదిడుదాక విడువకుండు
తలచినదేదియో తలచనే తలచితివి
తలపు తీరెడుదాక తరలకుండు
పోరుపడలేక తానైన బ్రోవవలయు
ఒడలు తెలియక నీవైన ఉడుగవలయు
అంతియే కాని మధ్యలో ఆపివేసి
తిరిగిపోవుట భక్తుని దీక్ష కాదు.

— బాబా

“ మాటలందు తీపి మనసులో చేదుండ
మంచి కాదు మీకు మచ్చగాని
మచ్చలేని బ్రతుకె మహిలోన చెల్లురా
ఉన్నమాట తెలుపుచున్నమాట. ”

# సాయి సూక్తులు

" క్రూరమృగము తెచ్చి కూర్మితో పెంచిన
ఆకలయ్యెనేని అదిరిపడును
దుర్గుణంబులు గల దుష్టుల సంఘంబు
క్రూరమృగముల కంటె ఘోరమగును. "

" చదువు చదివి చదివి సద్గుణంబులు లేక
పరుల మోసగించి బ్రతుకువాడు
వాని కంటె మేలు వసుధలో గాడిద
బరువు మోసి తాను బ్రతుకుచుండు. "

" పెద్దలన్నమాట పెరుగన్నమును బోలు
స్వీకరించవలయు చిత్తమందు
అట్లు చేయకున్న హానియు కలుగును
ఉన్నమాట తెలుపుచున్నమాట. "

" తుప్పు పట్టినదానిని తుడువవచ్చు
పొట్టు విత్తనములు విడగొట్టవచ్చు
కోరి అజ్ఞానమును తరుమంగవచ్చు
కాని మూర్ఖుని సంధింప కాదు సుమిత్ర. "

" తేలు విషముకన్న తెంపరాకులకన్న
పదును కత్తికన్న పాముకన్న
మత్సరంబు గల్గు మనుజుండు ఇలలోన
కుత్సితుండు వాడె తుచ్ఛితుండు. "

# ప్రశాంతినిలయం

సత్యం శివం సుందరం
పర్తీశ్వరుని మందిరం
దివ్యప్రేమ ధామం
అది ప్రశాంతినిలయం . . .

సాయినాథుని ఆలయం
సకల విద్యలకు నిలయం
విజ్ఞాన కేంద్రం
అది ప్రశాంతినిలయం . . .

సత్యసాయి నిలయం
విశ్వానికే ఆలయం
భక్తులకు ధ్యానకేంద్రం
అది ప్రశాంతినిలయం . . .

ప్రేమసాయి మందిరం
శాంతి ప్రేమలకు నిలయం
విశ్వశాంతికి మూలం
అది ప్రశాంతినిలయం . . .

సాయీశ్వరుని ఆలయం
భక్తులకు దేవాలయం
బాలురకు విద్యాలయం
అది ప్రశాంతినిలయం . . .

— కొమరగిరి

## ప్రస్తావన

ఈనాడు ప్రపంచంలో ముఖ్యంగా మన భారతావనిలో అనేక మంది బాబాలు, పీఠాధిపతులు, సాధువులు, సన్యాసులు కనిపిస్తున్నారు. వారిలో చాలామంది ఆధ్యాత్మిక ప్రబోధనలు చేస్తూ తమ తమ మతాలకు పీఠాలకు పరిమితమై వున్నారు. మరికొందరు రాజకీయ నాయకులతో, మంత్రులతో సంబంధాలు ఏర్పర్చుకొని, దేశ రాజకీయాలలో జోక్యం చేసుకుంటూ, రాజకీయ గురువులుగా చలామణి అయి, కొంతకాలం ఒక వెలుగు వెలిగి తెర మరుగైపోతున్నారు. మరికొందరు పారిశ్రామిక సంస్థలను నెలకొలిపి, ఆయుధ కర్మాగారాలను సయితం నడుపుతూ విదేశాలతో అక్రమ సంబంధాలను పెంచుకొని అప్రతిష్టపాలైనవారూ వున్నారు. వీరందరిని చూచి ఎవరిని నమ్మాలో, ఎవరిని నమ్మకూడదో అర్థం కాక సామాన్యులు సతమతమవుతున్నారు. ఇది అవకాశంగా తీసుకొని హేతువాదులు విమర్శిస్తున్నారు. ఇది ఈనాటి పరిస్థితి, దుస్థితి.

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి ఆలోచనా సరళి యిందుకు భిన్నంగా కనిపిస్తున్నది. ఒక్క ఆధ్యాత్మిక ప్రబోధనలకే పరిమితం కాకుండా విద్యారంగమును, సేవారంగమును సంస్కరించటానికి వారు ఎనలేని కృషిని కొనసాగిస్తున్నారు. మానవత్వపు విలువలైన సత్య, ధర్మ, శాంతి, ప్రేమ, అహింసలను గురించి ప్రబోధిస్తూ మానవునిలో మానసిక పరివర్తనను గైకొనిరావటానికి ప్రయత్నిస్తున్నారు. బాల బాలికలలో నైతిక, ఆధ్యాత్మిక, శీలసంపత్తులను యినుమడింపజేయ టానికి, విద్యాలయములను నెలకొలిపి, ఉత్తమ శిక్షణను గరుపుతున్నారు. సేవలోని పరమార్థమును ఎరుకపరచి, సేవాకార్యక్రమాలలో చురుకుగా పాల్గొనే విధంగా ప్రజలను ప్రేరేపిస్తున్నారు. వేదవేదాంగ, పురాణ

ఇతిహాసములలో నున్న పవిత్రమైన, అమూల్యమైన విషయాలను సామాన్య మానవునికి అర్థమయ్యే రీతిలో, సామాన్య, సరళమైన భాషలో ఉపమాన ఉపమేయములతో భక్తులకందించి, వారిలో మానసిక పరివర్తనను కలుగజేస్తున్నారు. ఇటువంటి మహత్తర కార్యక్రమమును భారత దేశంలో మరే పీఠాధిపతిగాని, మఠాధిపతిగాని, మరే బాబాగాని చేయటంలేదని చెప్పవచ్చు. ఒక్కమాటలో చెప్పాలంటే ఈనాటి "యుగ సంస్కర్త శ్రీ సత్యసాయిబాబా". వారి ఆధ్యాత్మిక ప్రబోధలను, వారు చేబట్టిన సంస్కరణోద్యమాన్ని, వారి అవతార విశిష్టతను లోకానికి తెలియపరచటమే ఈ చిన్న పుస్తకం యొక్క ప్రధాన లక్ష్యం.

## చమత్కారవాణి

భగవాన్ బాబా తరచుగా తమ ప్రసంగాలలో చమత్కారాలు విసురుతూ వుంటారు. పైకి చమత్కారాలుగా వినిపిస్తాయి, కనిపిస్తాయి గాని, వాటి వెనుక ఎంతో ఆధ్యాత్మిక విశ్లేషణ వుంటుంది. ఈనాడు చాలామందిలో వేదాంతం అంటే అంతం లేనిదని, అదేదో పండితులకు మాత్రమే పరిమితమైన రహస్యమని, అద్వైతమంటే అర్థం కానిదనే అభిప్రాయం వున్నది. దీనిలో కొంత యదార్థం లేకపోలేదు. ఎందువలనంటే...ఆధ్యాత్మిక తత్వవేత్తల ప్రసంగాలు సామాన్యులకు అర్థం కావటంలేదు. పండితుల స్థాయికి పామరులు అందుకోలేకపోతున్నారు. పామరులకు అర్థమయ్యేటట్లుగా పండితులు చెప్పలేకపోతున్నారు. ఇది ఈనాటి పరిస్థితి. అయితే భగవాన్ బాబా మాత్రం జటిలమైన వేదాంత విషయాలను సయితం చిన్న చిన్న సామెతలతో, ఉదాహరణలతో విడమరచి చెప్పటం వారి ప్రత్యేకత. బాబా మొట్టమొదట ఏదో ఒక చమత్కారం (విభూతిగాని, వస్తువులనుగాని సృష్టించి) చేసి భక్తులను

ఆకట్టుకుంటారు. తరువాత వారి దివ్య ప్రబోధనల ద్వారా మనలో సంస్కారాన్ని కలుగజేస్తారు. ఆ సంస్కార ఫలితంగా మనలో పెరుగుతుంది పరోపకారబుద్ధి. ఆ పరోపకార బుద్ధియే సాక్షాత్కారము నకు తొలి మెట్టు అవుతుంది. చమత్కారం- సంస్కారం- పరోపకారం- సాక్షాత్కారం - ఈ నాలుగు సోపానాల మార్గమే సాయి చూపే ఆధ్యాత్మిక మార్గం.

## మహిమలు

భగవాన్ బాబా దృష్టిలో మహిమలకు ఎట్టి ప్రాధాన్యతా లేదు. అయితే అవి ప్రజానీకంలో ఆస్తికత్వాన్ని, విశ్వాసాన్ని పెంపొందించ టానికి, నైతిక ఆధ్యాత్మిక మార్గంలో పయనించటానికి దోహదం చేస్తాయి. స్వామి ఒక పర్యాయం మహిమలను గురించి ప్రస్తావిస్తూ "నేను చేసేది మెస్మరిజం కాదు, మాయ కాదు. నా శక్తి దివ్యమైనది, విశ్వవ్యాప్తమైనది, అనంతమైనది. అవి నా visiting cards. అవి యిచ్చినవారికి ఏదైనా ప్రమాదం సంభవించినా, వారికి నా సహాయం అవసరమైనా, ఆ బహుమతులు మెరపులాగే నాకు ఆ ఆ విషయాన్ని తెలియజేస్తాయి. వారిని అప్పుడు ఆదుకుంటాను. బిడ్డలు కళాశాల నుండి శెలవలలో గృహమున కేతెంచి తిరిగిపోవునప్పుడు, తల్లి బిడ్డల కొరకు నానా విధ రుచ్య పదార్థములు తయారుచేసిపెట్టుట తన మాతృ హృదయమును తెలుపుటకేగాని, ఇతర ఉద్దేశ్యములతో కాదు గదా! అట్లే నన్ను చేరువారిని భగవన్ముఖులుగా చేయుటకై ప్రేమతో, ఇట్టి దైవీశక్తికి సంబంధించిన మహిమలను చూపి, వారిని దైవభక్తులుగా తయారుచేయుదును. ఇది నా స్వభావము. నా ప్రేమానుగ్రహములు కనపరచు విధానము" అని అంటారు బాబా,

## మానవత్వం, ప్రేమతత్వం

మానవత్వం, ప్రేమతత్వం - ఈ రెండు విషయాలు ప్రస్తావించకుండా బాబా తన ఉపన్యాసాన్ని ముగించరు. మానవత్వం లేని భక్తి నిరుపయోగమంటూ బాబా, "మానవుడు పుట్టి లక్షల సంవత్సరాలైనా మానవత్వం యింకా పురిటినొప్పులు పడుతూనే వున్నది" అని స్వామి తన బాధను, వ్యధను ఒక పర్యాయం వెలిబుచ్చారు. వారి మాటలను అర్థం చేసుకుంటే బాబా పడే వేదన ఎంతటిదో మనకు బోధపడుతుంది.

" సేవ చేయునట్టి సేద్యపు పశువును
చేరి చితకగొట్టు చిత్రముగను
రాతి ఎద్దును చూచి
తానె భక్తితో పూజించు "

అంటూ "జీవుళ్ళను బాధిస్తారు, దేవుళ్ళను పూజిస్తారు. ఒక చంప జీవం వున్న ఎద్దును బాధిస్తూ, దేవాలయానికి వెళ్ళి జీవం లేని రాతి నందిని పూజిస్తారు. జీవం వున్న కోతి కనపడితే చాలు రాయితో కొడతారు. ఆంజనేయస్వామి పేర కోతి బొమ్మల (రాయి) కు కొబ్బరికాయలు కొడతారు" అని బాబా తన ఆందోళనను ఒక పర్యాయం వ్యక్తీకరించారు. మానవత్వం మూర్తీభవించిన 'మానవతావాది' బాబా.

బాబా ప్రేమకు పెద్ద పీట వేశారు. ప్రేమను ఉత్తమ మానవత్వపు విలువగా పేర్కొంటూ "ప్రేమ ఎక్కడ వుంటుందో, అక్కడ త్యాగం వుంటుంది. ఎక్కడ త్యాగమో అక్కడ నిర్మలత్వమేర్పడుతుంది. దేహమునకు చేతులు, కాళ్ళు, శిరస్సు ఎంత ప్రధానమైనవో; ప్రేమ, త్యాగం, నిర్మలత్వం మానవత్వమునకు అంత ప్రధానమైనవి. ఈ మూడు అంగములు లేకుండిన మానవత్వమునకు

పూర్ణత్వము లేదు" అంటూ రోజూ మూడువేళలా ప్రేమను ప్రకటించ మని స్వామి బోధించారు.

" Start the day with Love
Fill the day with Love
End the day with Love
That is the way to God "

## సేవ ( Service )

" గ్రామ సేవ బినా నిర్వాణ నహీ " గ్రామ సేవకు మించినది మరొకటి లేదన్నారు బాబా. సేవ అంటే చాలామంది "నిష్కామకర్మ" అని భావిస్తుంటారు. దీనిని Good work (మంచి పని) అంటారు. కాని సాయి సేవకులు చేస్తున్నది God's work దైవముయొక్క పని అంటారు స్వామి. ఒక పర్యాయం స్వామి సేవయొక్క లక్ష్యమును వివరిస్తూ "ప్రేమకు మించిన ఆధ్యాత్మిక సాధన లేదు, ప్రేమయొక్క పరాకాష్ట సేవ. సేవయొక్క స్ఫటిక రూపం త్యాగం. నువ్వు ధ్యానంలో వున్నాసరే, నీ సహాయం కోరి ఎవరైనా వస్తే, తక్షణం వెళ్ళి చేయగలిగిన సేవ చేయి" అంటారు. సేవ చేసేవాళ్ళను చూస్తే స్వామికి మంచి అభిమానం. మరొక సందర్భంలో స్వామి "సమాజ మును భగవంతుని విశ్వరూపంగా తలంచుడు. సంఘ సేవే సర్వేశ్వరుని సేవగా విశ్వసింపుడు. పేరుప్రతిష్ఠలకు ప్రాకులాడక, ద్వేషభావము లకు చోటివ్వక, వ్యక్తిత్వమును వెనుకకు నెట్టి, శక్తిసామర్థ్యముల కొలది సంఘ సేవకు కంకణం కట్టుడు" అని హెచ్చరిస్తారు. చాలా మంది ఈనాడు సమాజంలో పేరుకోసం సేవ చేస్తుంటారు. సేవకు ఖర్చు చేసేదానికన్నా దాని ప్రచారమునకు ఎక్కువ ఖర్చు చేస్తుంటారు. వారికి కావాల్సింది ప్రచార ఆర్భాటాలు మాత్రమే. స్వామి దీనిని అంగీకరించరు. సేవలోని ఆధ్యాత్మిక అనుభూతిని, ఆనందమును సేవ

చేసేవారు, సేవ పొందేవారు పంచుకొన్నప్పుడే సేవ, యోగంగా మారుతుందంటారు బాబా. స్వామి ఆశించేది సానుభూతితో కూడిన సేవ కాదు. నైతిక సానుభూతికన్నా అన్నివిధాలా ఉన్నతమైనది ఆధ్యాత్మిక ప్రేమ. అది కేవలం సానుభూతిగానే కాక పరివర్తనను సాధించగల దివ్యశక్తిగా రూపొందుతుందంటూ "Love all, serve all, help ever, heart never" "అందరిని ప్రేమించు, అందరిని సేవించు, ఎల్లప్పుడూ సహాయం చేయి, ఎవరినీ బాధించకు" అనే అభ్యుదయ నినాదాన్ని భక్తులకు అందించారు బాబా. భగవాన్ బాబా "పరిపూర్ణ మానవతావాది" అంటే ఏ మాత్రం అతిశయోక్తి లేదు.

## కింకరుడు - శంకరుడు

"సేవకుడు కానివాడు నాయకుడు కాలేడు; కింకరుడు కానివాడు శంకరుడు కాలేడు" అని బాబా ఒక పర్యాయం చమత్కరించారు. ఇది పైకి చమత్కారంగా కనిపించవచ్చు. దీనిలో ఎంతో నిగూఢమైన అర్థం యిమిడి వున్నది. ఈనాడు ప్రజలకు ఏ మాత్రం సహాయం చేయకుండానే ఏవో అడ్డదారుల ద్వారాఅందెలం ఎక్కాలని ప్రయత్నం చేస్తున్నవారెందరో ! " సేవ జీవితమునకు ఆనందమును, రుచిని కలిగించే లవణం వంటిది. సేవలోనే వున్నది పవిత్రత. సేవ ద్వారా ప్రేమ అనుభూతిలోనికి వస్తుంది. హృదయ విశాలత పెరుగుతుంది. సేవద్వారా భగవంతుని మెప్పును కూడా పొందవచ్చును. సేవ చేసి లక్ష్మి తరించింది. సేవకుడుగా, నమ్మినబంటుగా హనుమంతుడు ప్రశంసల నందుకున్నాడు. సేవను గురించి ఉపన్యాసం చెప్పడంకంటే సేవ చేసి చూపించటంలోనే వున్నది గొప్పతనం" అని అంటూ స్వామి...

" చెప్పవచ్చు కోటి, చెయ్యరు ఒక్కటి
చెప్పుట సులభము, చేయుట కష్టము
దాతకైన వాని తాతకైన
చెప్పుట కంటె చేయుటయే మేలు "

అని అంటారు. కనుక ఫలాపేక్షను ఆశించకుండా సేవ చేయటం నేర్చుకున్నప్పుడు ఆ సేవ పవిత్రమైనది అవుతుంది.

## Season, Reason

" పశు పక్ష్యాదులకు ఒక season (ఋతువు) ఒక reason (కారణం) వుంది. కాని మానవులకు మాత్రం no season, no reason " అంటారు బాబా. ఆ మాటల వెనుక నున్న బాబా ఆవేదనను అర్థం చేసుకుంటే సమాజానికి ఎంతో మేలు చేసినవారమవుతాం. "పశు పక్ష్యాదులకు మాటలు రావుగాని, ఆచరించి చూపిస్తుంటాయి. మాటలు నేర్చిన మానవుడు మాత్రం ఆచరణలో ఏమీ చూపించటంలేదు. మానవత్వంమీద ప్రసంగాలు దంచుతాడుగాని ఆచరణలో మానవత్వం ఏ మాత్రం చూపించడంలేదు. ఆకలైనప్పుడు పశుపక్ష్యాదులు ఎంత దూరమైనా వెళ్ళి తినేసి వస్తాయి. వాటికి దాచుకోవటం తెలియదు. దోచుకొని దాచుకొనేవాడు ఒక్క మానవుడే" అని అంటాడు బాబా. ఇది నూటికి నూరుపాళ్ళు సత్యం. పశుపక్ష్యాదులకు మాటలు రావు. మానవునికి మాత్రం మాటలు వచ్చు. మాటలు వచ్చిన ద్విపాద పశువు మానవుడు.

## విద్యారంగం

ఈనాడు అనేక విద్యాలయాలలో అశాంతి చెలరేగటానికి కారకులు అధ్యాపకులు కూడా అవుతుండటం కడు శోచనీయం. అధ్యాపకులు

తమ విద్యుక్త ధర్మాన్ని నిర్వర్తించకపోవటంవలన విద్యార్థులలో క్రమశిక్షణారాహిత్యం పెచ్చు పెరిగిపోతున్నది. నేడు ఉపాధ్యాయులలో చాలామంది తమ బాధ్యతలను విస్మరిస్తున్నారు. ఈ యదార్థమును గ్రహించిన బాబా ఒక పర్యాయం తమ ప్రసంగంలో "ఒక విద్యార్థి చెడిపోతే దానివలన అతనే పాడౌతాడు. ఒక ఉపాధ్యాయుడు క్రమశిక్షణతో నిర్వర్తించకపోతే వేలమంది విద్యార్థులు చెడిపోతారు" అని అంటారు. అనటమే కాదు, మొట్టమొదట ఉపాధ్యాయులకు శిక్షణా తరగతులను కూడా ఏర్పాటు చేసారు. స్వాతంత్ర్యానంతరం విద్యారంగంలో మార్పు వస్తుందని పెద్దలు ఆశించారు. కాని ఆశించిన మార్పుకు మాత్రం రాలేదు. ఈనాడు ఈ రంగంలో ఎవరూ చేయని పని బాబా ఒక్కరే చేస్తున్నారు. విద్యారంగమును ప్రక్షాళన చేయటానికి స్వంతంగా అనేక విద్యాలయాలను నెలకొల్పి బాలబాలికలకు ఉత్తమ శిక్షణ గరుపుతున్నారు. అత్యంత అధునాతనమైన విద్యతోపాటు ఆధ్యాత్మిక విద్యను మేళవించి బాలబాలికలకు బోధిస్తున్నారు. కె.జి. నుండి పీ.జి. వరకు ఫీజులు లేకుండా ఉచితంగా విద్య గరపటం అక్కడి ప్రత్యేకత. అంతఃకరణమును పరిశుద్ధము గావించునదే అసలైన విద్య అని బాబా విశ్వాసం. అందుకే "Education is for life and not for living" అని అంటారు బాబా. బాబా సిద్ధాంతాలతో ఆధ్యాత్మిక చింతనలతో ఏ మాత్రం ఏకీభవించనివారు సయితం, విద్యారంగంలో బాబా చేస్తున్న ఎనలేని కృషిని ప్రశంసిస్తున్నారు.

## ర్యాంకులు - బ్లాంకులు

"మార్కులు చూస్తే ర్యాంకులు; అనుభవం చూస్తే బ్లాంకులు, జీరోలు" అన్నారు బాబా. ఇంతకు పూర్వతరం వారికన్నా నేటి విద్యార్థులు తెలివితేటలు గలవారే. ర్యాంకులలో ఉత్తీర్ణులవుతున్నారు.

బంగారు పతకాలు కూడా పొందుతున్నారు. అయితే వారిలో అసలు వుండవలసిన గుణం మాత్రం కనిపించటంలేదు. గుణం ముఖ్యమా? ర్యాంకులు ముఖ్యమా? అంటే రెండూ రెండు చక్రాలుగా వుండాలంటారు బాబా. కనుక తెలివితేటలతోపాటు గుణసంపత్తిని కూడా సంపాదించాలి. నైతిక, ఆధ్యాత్మిక, శీల సంపత్తులను పెంపొందించుకోవాలి. అందు వలననే " The end of education is character " అన్నారు బాబా.

## Tank-Tap

భగవాన్ బాబా అధ్యాపకులను Water Tank తోనూ, విద్యార్థులను Tap తో పోలుస్తూ Tank లో ఎటువంటి నీరువుంటే, అటువంటి నీరు Tap ద్వారా లభిస్తుందంటారు. Tank లో మంచినీరుంటే Tap ద్వారా మంచినీరే లభిస్తుంది. ఒకవేళ Tank లో కంపుకొట్టే నీరుంటే Tap ద్వారాకూడా దుర్గంధపూరితమైన నీరేలభిస్తుంది. అసలు Tank లో నీరే లేకపోతే Tap లో నీరే రాదు. కనుక ఎట్టి అధ్యాపకుడో అట్టి విద్యార్థి తయారవుతాడంటారు బాబా. గురువు శ్రేష్ఠుడయితే విద్యార్థి కూడా గొప్పవాడయ్యే అవకాశమున్నది. Tank లో పుష్కలంగా నీరుంటే Tap ద్వారా నిరంతరం నీరు లభిస్తుంది. అదేవిధంగా అధ్యాపకుడు నిరంతరం అధ్యయనం చేస్తూవుంటేనే విద్యార్థులకు తగిన బోధనను అందించగలడు. అధ్యాపకులు ఆదర్శ జీవితాన్ని గడిపిన రోజున విద్యాలయాలు ఆదర్శవంతంగా వుంటాయని బాబా విశ్వాసం. అప్పుడే విద్యార్థులు సత్ప్రవర్తనను అలవరచుకుంటారని బాబా నమ్మకం. ఇది వాస్తవంకూడాను.

## అధ్యాపకులు - విద్యార్థులు

ఈనాడు చాలామంది విద్యావేత్తలు శీలం (Character) అన్నా, పవిత్రత (Purity) అన్నా అర్థంకాని స్థితిలో వున్నారు. విద్యలో శీలము, పవిత్రతలకు ప్రత్యేక స్థానం వుండాలంటారు బాబా. "Education (విద్య) అంటూ Agitation (ఆందోళన) ప్రేరేపిస్తున్నారు కొందరు అధ్యాపకులు. Agitation (ఆందోళన) కాదు, Elevation (ఔన్నత్యం)ను ప్రదర్శించాలి" అంటారు బాబా. ఈనాటి విద్యార్థులలో Purity (పవిత్రత) లేకుండా పోయింది. Unity (ఐకమత్యం) అంతకన్నా లేదు. Enemity (శతృత్వం) మాత్రం ప్రబలిపోతున్నదని బాబా తమ ఆవేదనను వ్యక్తంచేశారు. ఈనాడు చాలా విద్యాలయాలలో Unity కోసం Unions ను ప్రారంభిస్తున్నామంటున్నారు. Union అంటే అందరూ కలిసి వుండటం. కాని యూనియన్ల పేరుతో పోటీలుపడి చిన్నాభిన్నమైపోతూ Co-operation ను సాధించవలసిన విద్యార్థులు Operations చేస్తున్నారని బాబా ఒక పర్యాయం చమత్కరించారు. ఇది చమత్కారం కాదు. ఈనాడు ప్రతి విద్యాలయంలో జరుగుతున్న తతంగమే. ఈనాడు Bookkish Knowledge (పుస్తక జ్ఞానం) మాత్రం పెరిగిపోతున్నది. అనుభవజ్ఞానం అసలే వుండటంలేదు. విచక్షణా జ్ఞానం ఏ మాత్రం కనిపించటంలేదు. ఈనాటి Bookkish Knowledge రేపు Knowledge తరువాత Elergy (ఎలర్జి)గా వికటిస్తున్నది. అదికాదు. Knowledge దివ్యమైన Energy (శక్తి)గా మారాలిగాని Elergy (ఎలర్జి)గా మాత్రం కారాదంటారు బాబా. ఒక పర్యాయం విద్యార్థుల సభలో బాబా ప్రసంగిస్తూ "మీ Marks కాదు నాకు కావాల్సింది Remarks రాకుండా చూచుకోండి" అని హెచ్చరించారు. బాబా చేసే ప్రసంగాలు, సూచనలు, హెచ్చరికలు పైకి

చమత్కారాలుగా కనిపించినా, వినిపించినా వారు మాట్లాడే ప్రతి మాట వెనుక ఎంతో నిగూఢమైన అర్థం, సందేశం వుంటుంది. లోతుకుపోయి పరిశీలిస్తే దానిలో నేర్చుకోవలసింది ఎంతో వుంటుంది.

## Devotion - Deepocean

భగవాన్ బాబా ఒక పర్యాయం భక్తిని గురించి ప్రబోధిస్తూ " డివోషన్ (భక్తి) లేని బ్రతుకు ఓషన్ (సముద్రం) ". శ్రద్ధాభక్తులు లేని జీవితం సముద్రం లాంటిదని పేర్కొనినారు. డివోషన్ (భక్తి) అంటున్నాము కాని డీప్ఓషన్ (సంసార సాగరం)లో వుంటున్నాము. డివైన్ (దివ్యత్వం) అంటాము కాని డీప్‌వైన్ (గాఢమైన మత్తు)లో వుంటున్నాము. కలిప్రభావంగా భక్తి, ఆడంబర నృత్యంగా కనిపిస్తున్నది. చెప్పడం శరణాగతి, చేయటం జగద్గతి. ఇవన్నీ అనిత్యమన్న సత్యాన్ని గుర్తించే జ్ఞానం కలగాలంటారు బాబా.

## విత్తచోరుడు - చిత్తచోరుడు

" భగవంతుడు నీ భక్తిని చూస్తాడేగాని నీ శక్తిని చూడడు. నీ గుణమును చూస్తాడేగాని నీ కులమును చూడడు. నీ నీతిని చూస్తాడే గాని నీ జాతిని చూడడు. నీ చిత్తమునేగాని నీ విత్తమును చూడడు భగవంతుడు ఎప్పుడూ చిత్తచోరుడే, విత్తచోరుడు కాదు " అని బాబా చక్కగా చమత్కరించారు. దీనినిబట్టి మోక్షమును పొందటానికి జాతి, మత, కుల, వర్గ, లింగ బేధములు లేవనే విషయం స్పష్టమవుతున్నది. పశు పక్ష్యాదులు, జంతువులు సహితం మోక్షమునకు అర్హులేనని మన పురాణగాధలు స్పష్టం చేస్తున్నాయి. ఫలితాన్ని ఆశించకుండా నిష్కామ కర్మ చేసినవారికి మోక్షం ప్రాప్తిస్తుంది.

## త్రివేణి సంగమం

ఈనాడు లోకంలో చాలామంది భక్తి, జ్ఞాన, వైరాగ్యములను వేరువేరుగా భావించి ద్వేషిస్తున్నారు. ఇది పొరపాటు. ఈ మూడింటిని కలిపి సాధన సలిపినప్పుడే గమ్యమునకు చేరుకోగలరని బాబా అభిప్రాయం. "భక్తి జ్ఞానం లేని వైరాగ్యం, భక్తి వైరాగ్యం లేని జ్ఞానం, వైరాగ్య జ్ఞానం లేని భక్తి గమ్యమునకు చేరదు. కొంతవరకు పుణ్య సంస్కారం కలిగించవచ్చును తప్ప, దీనివలన మేము భక్తులం, జ్ఞానులం, విరాగులం అని తెలుపుకొనుటలో ద్రోహము తప్పదు. కాన సాధకులు ఈ త్రివేణి సంగమంలో మునిగినప్పుడే ఫలితము చేజిక్కుతుంది" అంటారు బాబా. ఈ యదార్థమును ఆచరణలో పెట్టనివారు సాధకులు కారు. గ్రామఫోన్ ప్లేటువంటివారే అవుతారు. వారివలన ఇతరులకు ప్రయోజనం లేకపోగా, చిట్టచివరికి వారికికూడా ప్రయోజనం వుండదు.

## 'ఆర్' త్రయము

మొదట మన దోషాలను గుర్తించుకుంటే భగవంతుని పవిత్ర హృదయం మనకు అర్థమవుతుంది. కాని ఈనాడు తన దోషాలను మాత్రం కప్పిపుచ్చుకొని, భగవంతుడిచ్చిన శిక్షను మాత్రం ప్రచారం చేయటం జరుగుతుంది. ఏ చిన్న విషయంలోనయినా సరే కారణం లేని కార్యముండదు. ప్రతి Action (పని)కు Reaction (ప్రతీకారం) వుంటుంది. అదే విధంగా Sound (శబ్దం)కు Resound (ప్రతిధ్వని) వుంటుంది. ప్రతి ఆకారానికి ప్రతిబింబం (Reflection) వుంటుంది. భగవంతుడు ప్రతిఫలం యివ్వటానికి కాచుకొని వుంటాడు. మంచిపని చేస్తే మంచి ఫలితం, చెడ్డపని చేస్తే చెడ్డ ఫలితం యిస్తాడు అంట్లూ

ప్రతి Action ( పని ) కి Reaction, Resound, Reflection వెంటాడుతూ, జంటాడుతూ వుంటాయంటారు బాబా. అందుకనే భగవంతునికి " కర్మఫలదాత " అని పేరు వచ్చిందని చెప్పారు బాబా.

" పవిత్ర కర్మలు చేయటానికి పూనుకోము. కాని పవిత్రమైన ఫలితాలను మాత్రం కోరుతాం. పుణ్యకర్మలు ఆశిస్తాము కాని పుణ్య కార్యాలు చేయటానికి మాత్రం ముందుకు రాము. పాపకర్మ ఫలితాలు వద్దంటాం. కాని పాపకార్యములు చేయటానికి ఏమాత్రం వెరువం " అని బాబా తన బాధను వ్యక్తంచేశారు. కర్మ ఫలితమే జన్మమునకు మూలకారణం. కనుక ప్రతి ఒక్కరూ మంచి కర్మలను మాత్రమే చేయటానికి ముందుకు రావాలి.

## ' ద ' కార త్రయము

ఒకే మనిషిలో దైవత్వమున్నది, మానవత్వమున్నది, దానవత్వం కూడా వున్నది. ఆయా పరిస్థితుల ప్రభావమును బట్టి అవి ప్రదర్శితమవుతూ వుంటాయి. అధమ స్థాయి నుండి ఉన్నతమైన ఉత్తమ స్థాయికి ఎదగడంలోనే వున్నది గొప్పతనం. పైనుంచి క్రిందకు జారటం తేలిక. అది మానవుని అధఃపతనాన్ని సూచిస్తుంది. కనుక ఉత్తమ స్థాయికి చేరుకోవటానికే ప్రతి మానవుడు కృషిచేయాలి. ఒక పర్యాయం బాబా ఈ విషయమును గురించి చక్కగా వివరించారు. దానవత్వము నుండి మానవత్వానికి ఎదగాలంటే ' దయ 'ను అలవరచు కోవాలి. మానవత్వం నుండి దైవత్వానికి పెరగాలంటే ' దానం ' చేస్తూవుండాలి. దైవత్వము నుండి ఏకత్వానికి చేరుకోవాలంటే " దమ్యత " (ఇంద్రియ నిగ్రహం)ను పాటించాలని చెప్పారు. దానవులు దయను ప్రదర్శించాలి. మానవులు దానాలు చేయాలి. దేవతలు

దమ్యతను అలవరచుకోవాలి. ఇది నిజంగా ఒక పెద్ద సంస్కరణ కార్యక్రమమే. ఈ మూడు తెగలవారు, ఈ మూడు సద్గుణములను ఆచరణలో పెట్టినప్పుడు ఉన్న స్థాయి నుండి ఉన్నత స్థాయికి చేరుకోవటానికి అర్హతను సంపాదించినవారవుతారు.

## 'డ'కార త్రయము

భగవాన్ బాబా ప్రతిపాదించిన "డ"కారత్రయము అనగా Duty (కర్తవ్యం), Discipline (క్రమశిక్షణ), Devotion (భక్తిశ్రద్ధ) లు ముచ్చటైన మూడు మాటల మంత్రం లాంటిది. మన జీవితంలో చేయవలసిన కర్తవ్యాలను, శ్రద్ధాభక్తులతో, చిత్తశుద్ధితో క్రమం తప్పకుండా, ఆయా కాలాలలో నిర్వహించే ప్రవృత్తిని పెంచటానికి తోడ్పడే "టానిక్" లాంటిది ఈ సూత్రం. దీనిని ఆచరిస్తే ఆధ్యాత్మిక సాధనలోనే కాక, లౌకిక కార్యాలలో కూడా విజయం సాధించటం తథ్యం. కాబట్టి ఇహపరాలను సాధించగలిగే ఆచరణ సూత్రం యిది. డ్యూటీ శరీరానికి సంబంధించినది. డిసిప్లిన్ మనస్సుకు సంబంధించినది. డివోషన్ హృదయానికి సంబంధించినదంటూ "మనసులోని యోచన, మాటలోని సూచన, క్రియలోని ఆచరణ — ఈ మూడూ ఏకం కావాలి" అంటారు బాబా. దీనినే "త్రికరణశుద్ధి" అంటారని బాబా చెప్పారు. ఈ "డ"కారత్రయమును త్రికరణములుగా భావించి, మనం నిత్య జీవితంలోను, సామాజిక జీవితంలోనూ, ఆధ్యాత్మిక సాధనలోను కృతకృత్యులం కావాలి.

## 'అ'కార చతుష్టయము

భగవాన్ బాబా ఒక పరా "అ" కార చతుష్టయమును గురించి చక్కగా వివరించారు. 1. అనుమానం, 2. అవిశ్వాసం,

3. అసూయ, 4. అహంకారం. ఈ నాలుగింటిలో ఏ ఒక్కటి మానవునిలో ప్రవేశించినా మానవుని ప్రగతి దెబ్బ తింటుంది. అతని గతి అధోగతే అవుతుంది. ఈ దుష్టచతుష్టయము గనుక ఒక చోట చేరితే కురువంశానికి పట్టిన గతే పడుతుంది.

## 'డ' కార పంచకము

"విశ్వమనే విద్యాలయంలో నైతిక, భౌతిక, ధార్మిక, లౌకిక, వైజ్ఞానిక మార్గములెన్ని వున్నప్పటికీ, అన్నింటికీ కీలకమైనది ఆధ్యాత్మికము. ఆధ్యాత్మికములో కూడా కొన్ని విషయములు (Subjects) వున్నాయి. ప్రత్యేకమైన గ్రూపులు వున్నాయి. అవియే 'డ' కార పంచకములు :- 1. Dedication (ప్రపత్తి) 2. Devotion (భక్తి) 3. Discipline (క్రమశిక్షణ) 4. Discrimination (విచారణశక్తి) 5. Determination (పట్టుదల)—ఈ ఐదింటిని గ్రూపుగా తీసుకొని ఉత్తీర్ణులైన వారికి భగవాన్ ప్రేమను పొందే అధికారముంటుంది" అని అంటారు బాబా.

Dedication (ప్రపత్తి)లో మొట్టమొదట సమర్పించవలసినది అహంకార సమర్పణే. Devotion (భక్తి) అనగా నిరంతరం భగవంతుని తలంపులో వుండటం, ప్రేమతో భగవంతుని తలచుకోవడం, స్మరించడం, భజించడం, తపించడములే. నిత్యమూ క్రమశిక్షణతో నియమాన్ని (Discipline) సక్రమంగా అనుసరించాలి. మానవత్వం నియమనిష్ఠల పైననే ఆధారపడి వున్నది. విచారణాశక్తి (Discrimination) ప్రతి వారికి అవసరము. బుద్ధిద్వారా విచారణ సలపాలి. విచక్షణా జ్ఞానమును సంపాదించాలి. వివేకంతో వ్యవహరించాలి. పట్టుదల (Determination) పగ్గం వంటిది. ప్రగతి పథాన్ని చేరు

కోవాలంటే పట్టుదల అత్యవసరం. బాబా ప్రతిపాదించిన ఈ 'డ' కార పంచకము ఈనాటి మానవుల పాలిటి పంచాక్షరే.

## 'F' చతుష్టయము

"Follow the master, face the devil, fight to the end, finish the game – ఇదే నిజమైన జీవితం" అంటారు బాబా. ఇక్కడ Master ఎవరు? నీ మనస్సాక్షి. నీ యొక్క పవిత్రమైన హృదయమే నీకు నిజమైన మాష్టర్. నీ మనస్సాక్షిని అనుసరించుము, ధర్మము నాచరించుము, దుర్భావనలు, దురాలోచనలు దూరం చేసుకో, ఆఖరి వరకు పోరాడు, అరిషడ్వర్గాలను జయించు, మోక్షమును సాధించేంత వరకు విశ్రమించకు. పురుషార్థములు సాధించుటకు ఈ నాలుగు 'F' లు మూలాధారము" అని అంటారు బాబా. కనుక లక్ష్యమును సాధించేంతవరకు అవిశ్రాంత పోరాటము కొనసాగించాలి.

## 'అ'కార పంచకము

"అ" కారముతో ప్రారంభమయ్యేటటువంటి "అరిష్ట పంచకము" ఇది అని బాబా చెబుతూ " 1. అలక్ష్యం, 2. అవినయం, 3. అహంకారం 4. అసూయ, 5. అసభ్యం – ఈ ఐదింటిని కూడినటువంటి విద్యార్థి ఏ మాత్రం తగినటువంటివాడు కాదు. తల్లిదండ్రులు, పెద్దల ఆజ్ఞలను అలక్ష్యం చేయరాదు. అవినయంగా మెలగరాదు. విధేయులై విద్యను స్వీకరించాలి. మీ తెలివితేటలను ఆధారం చేసుకొని అహంకారమునకు ఏ మాత్రం అవకాశమివ్వరాదు. ఇతరులు ఉన్నతస్థాయిలో అభివృద్ధి అవుతున్నారని వారిని చూచి అసూయపడరాదు. ఈ నాలుగు మీలో ప్రవేశించినయెడల అసభ్యమనేటటువంటిది మీలో ఆవరిస్తుంది. సమాజంలో మీరు అసభ్యంగా ప్రవర్తించడం ప్రారంభమవుతుంది" అని అంటారు బాబా. కనుక ప్రతి విద్యార్థి ఈ అరిష్ట పంచకమునకు దూరంగా వుండాలి.

## Watch

" ఆదర్శాన్ని సాధించటానికి అకుంఠిత దీక్ష కావాలి. శీలాన్ని రక్షించుకోవటానికి ఎల్లప్పుడూ అప్రమత్తత కావాలి. 'Watch' అనే ఇంగ్లీషు పదములో ప్రతి అక్షరం మన శీలాన్ని కాపాడుకొనే విలువలను బోధిస్తుంది " అని అంటారు బాబా.

Watch your Words
Watch your Actions
Watch your Thoughts
Watch your Character
Watch your Heart

మనం మాట్లాడే మాటలు సత్యంపై ఆధారపడి వుండాలి. ఎదుటివారిని నొప్పించకుండా ఉండేట్లుగ మృదుమధురంగా మాట్లాడాలి. మన చేతలు స్వార్థరహితంగా, సేవాభావంతో వుండాలి. మాటలకు చేతలకు ఆలోచనలే మూలం గదా ! ఆలోచనలు పవిత్రంగా, స్వార్థరహితంగా, విశ్వశ్రేయోరూపంగా ఉంటే మాటలూ, చేతలూ వాటిని అనుసరిస్తాయి. మనోవాక్కాయ కర్మలను త్రికరణములని అంటారు. త్రికరణశుద్ధి మానవుని శీలానికి మూలం. శీలము జీవిత పుష్పానికి సుగంధంవంటిది. హృదయం అంటే మనస్సు నిర్మలంగా వుండాలి. మనస్సు నిర్మలంగా వుంటే మానవశీలం ఉదాత్తంగా వెలుగొందుతుంది. ఇదే ఈనాటి తరంవారికి బాబా అందించే పంచాక్షరి మంత్రం. దీనిని అవగాహన చేసుకొని ఆచరణలో పెట్టిన వారిని వరిస్తుంది అదృష్టం, సిద్ధిస్తుంది మోక్షం.

## కబంధులు, దైవబంధువులు

" కంబధులం కారాదు. దైవబంధువులం కావాలి. మన సంబంధం కబంధం కారాదు, దైవబంధం కావాలి. శబరి, గుహుడు, సుగ్రీవుడు,

ఆంజనేయుడు, జాంబవంతుడు, విభీషణుడు, జటాయువు—వీరందరూ దైవంతో సంబంధం పెట్టుకున్నారు కాబట్టి ముక్తిని పొందారు. కబంధుడు రాక్షసుడు. రామలక్ష్మణులను తన బాహువులతో బంధించాడు. పరమాత్మను బంధించటం వలన తగిన శాస్తిని అనుభవించాడు. కనుక మనం కబంధుడిలా ప్రవర్తించరాదు. మానవుడు తనలోనున్న దివ్యత్వమును తెలుసుకొని తోటి మానవునిలోగల దైవత్వమును గుర్తించి సన్నిహిత సంబంధం ఏర్పర్చుకున్నప్పుడు మనం దైవబంధువులం కాగలం" అని అంటారు బాబా.

## కృష్ణుని వాక్కు, రాముని క్రియ

"కృష్ణుని వాక్కును పవిత్రంగా, ఆదేశంగా మనం స్వీకరించాలి. రాముని క్రియను పవిత్రంగా భావించి ఆచరించాలి. రాముడు ధర్మాన్ని ఆచరించి చూపించాడు. కృష్ణుడు చెప్పి చేయించాడు. కనుక రాముడు చేసినట్లు చేయండి! కృష్ణుడు చెప్పినట్లు చేయండి!" అని చెప్పారు బాబా.

కృష్ణుడు, రాముడూ ఒకే విష్ణు తత్వమైనప్పటికీ, దేశ కాల ప్రభావములను ఆధారం చేసుకొని వారు ప్రవర్తిస్తూ వచ్చారు. శ్రీరాముడు కాలు త్రొక్కించుకొని కయ్యమునకు వెళ్ళాడు. కాని కృష్ణుడు కాలు త్రొక్కి కయ్యాన్ని తెచ్చుకున్నాడు. రాముడు స్త్రీ నిమిత్తమై పరితపిస్తూ వచ్చాడు. కాని కృష్ణుడు స్త్రీలను ఏడిపించాడు. రామునికి పని ముందు తరువాత నవ్వు. కృష్ణునకు నవ్వు ముందు, తరువాత పని. కనుక కృష్ణునకు, రామునకు చర్యలయందు పూర్తిగా విరుద్ధం కనిపిస్తుంది. కారణమేమనగా ఆ దేశకాల ప్రభావములను పురస్కరించుకొని వారు ఆ విధంగా ప్రవర్తించారని బాబా చెబుతూ కృష్ణుడు చేసినట్లు చేస్తే దెబ్బలు పడతాయంటారు. అంటే కృష్ణుడు అల్లరి చేసినట్లు మనం కూడా చేస్తే వీపులు చిట్లుతాయన్నమాట.

## ధృతరాష్ట్ర ప్రేమ

"నేటి ఆధునికయుగంలో నూటికి తొంభై పాళ్ళు తల్లిదండ్రులే పిల్లల్ని పాడుచేస్తున్నారు. ఇష్టమొచ్చినట్లు అధికారమిస్తున్నారు. తప్పులు చేస్తే దండించటంలేదు. పాపాలకు వడిగడితే నిందించటంలేదు. ఫలితంగా వారు మరింత పాతకులుగా మారిపోతున్నారు అటువంటి కుమారులను తల్లిదండ్రులు ఏమాత్రం క్షమించరాదు. పుత్ర ప్రేమ వుండవచ్చునుగాని ధృతరాష్ట్ర ప్రేమవలే ఎన్ని అక్రమాలు, అనాచారాలు చేసినా క్షమిస్తూ పోరాదు." అంటారు బాబా. ధృతరాష్ట్రుడు కృష్ణుని హితబోధలు విస్మరించాడు. విదురుని మాట వినలేదు. నా పుత్రులు గొప్పవారని విర్రవీగాడు. చివరికి జరిగిందేమిటో అందరికీ తెలిసిందే. బాబా ఛలోక్తిగా చెప్పినా వాస్తవం అందులో వున్నది.

## భీష్ములు కాదు, విభీషణులు కండి

"భీష్ములు కాదు విభీషణులు కండి!" అని బాబా ఒక పర్యాయం చమత్కరించారు. ఇది చమత్కారం కాదు. బాబా నేర్పే సంస్కారం. అట్టి సంస్కారం వచ్చినవారికి భగవత్ సాక్షాత్కారం లభిస్తుంది. దైవానుగ్రహం కలుగుతుంది. మహాభారత యుద్ధానికి ముందు కౌరవ సభలో ధర్మమేదో చక్కగా వివరించాడు శ్రీకృష్ణుడు. కానీ, కౌరవుల ఉప్పు పులుసు తిన్నామనే అభిమాన మమకారములచేత వారి పక్షముననే వుండిపోయారు భీష్మ ద్రోణ కృపాచార్యులు. జరుగవలసింది జరిగింది. అలనాడు రావణుడు చేస్తున్న అన్యాయ అక్రమ అనాచారములను చూచి సహించుకోలేక విభీషణుడు తన అన్నను విడిచివచ్చి శ్రీరాముని పాదములు పట్టాడు. దుష్టులకు దూరంగా పోయిన విభీషణుడు, విదురుడు రక్షించబడ్డారు. దుష్టులను, దుర్మార్గులను అంటిపెట్టుకొని వుండిన భీష్మ, ద్రోణులు కూడా సంహరించబడ్డారు. కనుక దోషములు చూచినా,

దోషములు విన్నా, దోషములు అనుభవించినా - దానిని సరియైన రీతిలో ఎదుర్కొని ఆ దోష పరిహారార్థమై ప్రయత్నం చేయాలి. అలా చేయని వారందరూ దుష్టులు, దుర్మార్గులతో పాటే శిక్షను అనుభవించవలసి వస్తుంది.

## అన్నాన్వేషణ కాదు ఆత్మాన్వేషణ

"దైవాన్ని వెతికే బుద్ధితో ధనాన్ని వెతుకుతున్నారు. ఆత్మను వెతుకవలసిన బుద్ధితో అన్నాన్ని వెతుకుతున్నారు. ఆత్మాన్వేషణ చేయకుండా అన్నాన్వేషణ చేయడం అజ్ఞానం కాదా ? మనం బ్రతికున్నది బ్రహ్మ కొరకు గాని అన్నం కొరకు కాదు. ఆహారం దేహసంరక్షణకే గాని ఆత్మసంరక్షణకు కాదు. తినటానికి బ్రతకరాదు, బ్రతకడానికి తినాలి. Eat to live, not live to eat " అన్నారు బాబా. మానవుడు తన జీవిత పరమావధి ఏమిటో గుర్తించలేకపోతున్నాడు. ఏదో విధంగా పొట్ట నింపుకోవాలని తాపత్రయ పడుతున్నాడు. ఎన్నో జన్మల పుణ్యఫలం ఈ మానవ జన్మ. దానిని సార్థకం చేసుకోవాలి.

## దీర్ఘ జీవితం, దివ్య జీవితం

"మానవుడు ఈనాడు ఆశించవలసింది దీర్ఘ జీవితం కాదు: దివ్య జీవితాన్ని ఆశించాలి. పొడిగించుకోవలసింది జీవితం కాదు. గుణాన్ని పొడిగించుకోవాలి. పొడిగించుకొనే జీవితం కాలాధీనం. బలపరచుకోవలసినది గుణం. వ్యక్తియొక్క క్రియాశీలత అంతా గుణములపైననే ఆధారపడి వున్నది. ధనం కాదు ప్రధానం, గుణం ప్రధానం. గుణం కంటే మించిన బలం వేరొకటి లేదు. ధనపోషణ ముఖ్యము కాదు, గుణ పోషణ ముఖ్యం. గుణహీనులు కావటంవలననే రావణుడు, దుర్యోధనుడు తమతోపాటు తమ వంశములను కూడా సర్వ

నాశనం గావించుకున్నారు. ధన బలం, జన బలం, సర్వబలాలు ఉన్నప్పటికీ గుణబలం, దైవబలం కనుక లేకపోతే జీవిత సమరంలో ఓడిపోవటం ఖాయం" అని అంటారు బాబా. కాకిలా చిరకాలం బ్రతకటం కంటే హంసలా కొంతకాలం బ్రతికినా చాలు.

## భీతి, ప్రీతి, నీతి

" పాపములు ఫలితమునందించక తప్పదు. కనుక పాపభీతిని, దైవప్రీతిని మనం పెంచుకోవాలి. సంఘంలో నీతిని అభివృద్ధిపరచాలి. మానవునికి ప్రధానమైన విలువలు ఈ మూడూ మాత్రమే. పాపభీతిలోనే అహింస, శాంతం లభిస్తాయి. దైవప్రీతి సత్య, ప్రేమలను అభివృద్ధి పరుస్తుంది. సంఘ నీతి మన ధర్మం.' నేటి రకరకాల విప్లవాలకు కారణం - పాపభీతి లేకపోవటం, దైవప్రీతి కోల్పోవడం, సంఘనీతి లేకపోవటంచేతనే మానవత్వపు విలువలను కూడా కోల్పోతున్నాము. నిజంగా మనలో దైవప్రీతి ఏర్పడుతే వెంటనే పాపభీతి కలుగుతుంది. ఈ రెండూ వుంటే వెంటనే సంఘములో నీతిని సాధించగలము. సంఘనీతి మానవజాతికి జ్యోతి" అని అంటారు బాబా. బాబా మాటలు బంగారపు మూటలు. బాబా పలుకులు వేదవాక్కులు. బాబా చెప్పింది సత్యం. దానినాచరించడం మన ధర్మం. ఆచరించితే వస్తుంది శాంతి, శాంతి తెస్తుంది మనశ్శాంతి. మనశ్శాంతి యిస్తుంది ప్రశాంతి. ప్రశాంతి నిలయమే ప్రేమకు నిలయం. అదే పర్తీశ్వరుని ఆలయం.

## గంగ దేకులం...

"మా కులం...మా కులం...మీ కులం ఏ కులం? గంగ దేకులం? గాలి దేకులం? నిప్పు దేకులం? వీటికి కులాలే లేవే? మన కులం మానవ

కులం. మన జాతి మానవజాతి. ఈ సత్యాన్ని గుర్తించాలి" అంటారు బాబా. "కాకులు, చీమలలో వున్నది ఐకమత్యం. కాని ఈనాడు మానవులలో ఆ Unity (ఐకమత్యం) లేకుండాపోయింది. Purity (పవిత్రత) అంటేకన్నా లేదు. Divinity (దివ్యత్వం) అసలే లేదు. నేడున్నదల్లా Community (కులం) మాత్రమే" అని బాబా తన ఆవేదనను వెలిబుచ్చుతూ...

"మతములన్నియు వేరు, మార్గమొక్కటె
వస్త్రబేధములు వేరు, వస్తువొక్కటె
శృంగారములు వేరు, బంగారమొక్కటె
పశువు వన్నెలు వేరు, పాలు ఒక్కటె
జీవజాతులు వేరు, జీవుండు ఒక్కడె
జాతి నీతులు వేరు, జన్మంబు ఒక్కటె
దర్శనంబులు వేరు, దైవంబు ఒక్కడె
పూలజాతులు వేరు, పూజ ఒక్కటె
తెలియలేకను మానవుల్ తెలివి తప్పి
బ్రతుకు కోసము బహు బాధ బడ్డ్దారి"

బాబా ఆలోచనలను ఆచరణలో పెట్టినప్పుడు కల్మషాలకు, కార్పణ్యాలకు తావే వుండదు. మానవుల మధ్యనున్న బేధభావము వాటంతట అవే వైదొలగిపోతాయి. విశ్వశాంతికి దోహదం చేసిన వారమవుతాము.

## నేనెవరిని ?

స్వామి ఒక పర్యాయం తన అవతార స్వరూపాన్ని ప్రకటించారు. "బాహ్యదృష్టితో చేసే నిర్ణయాలు వాస్తవములు కావు. అదేవిధముగ సాయి తత్వమును బాహ్యదృష్టిలో చూచి సాయి ఇట్టివాడు,

అట్టివాడు అంటున్నారు. వీరు సాయిలోని పవిత్రతను, యదార్థమును, నిత్యసత్యమును ఏమాత్రం గుర్తించలేకున్నారు. సాయి శక్తి అపారము, అనంతము. సర్వశక్తులు సాయి హస్తగతమై వున్నాయి. నా శక్తులకు హద్దులు లేవు. అనంతశక్తి, అనంతతత్వము, అనంత వ్యక్తిత్వము నా చేతుల యందున్నది. ఒక విధంగా నేను భక్త పరాధీనుడను. సామాన్య మానవుని రూపంలో మీతో కలసి, మెలిసి సంచరించుతూ, ఆడుతూ పాడుతూ వున్నప్పటికీ; మేధావంతులు, శక్తివంతులుకూడా నా శక్తిని, నా స్వభావమును అర్థం చేసుకొనలేరు. మానవత్వమును ఏకత్వ పరచి, ఆత్మతత్వమును నిరూపించి, దైవత్వము స్థాయిలో చేర్చడమే నా లక్ష్యము. ఎన్నోమహత్తర కార్యములు నిర్వహించటానికి, మానవ లోకాన్ని ఉద్ధరించటానికి, మానవులందరినీ సత్య, ధర్మ, శాంతి ప్రేమ మార్గములో నడిపించి వారిని గమ్యస్థానంలో చేర్పించడానికి వచ్చాను. దీనిని గురించి నాడు నేను చెప్పవలసిన అవసరం వచ్చినది కనుక చెప్పు చున్నాను. ఏమీ తెలియని వారికి ఏమి చెప్పినా అర్థం కాదు. తెలిసిన వారికి తిరిగి చెప్పనవసరంలేదు. తెలిసీ తెలియని వారికి నా మహిమలనే Visiting Cards ను యివ్వక తప్పదు" అని ప్రకటించారు బాబా. కనుక స్వామి శక్తి ఎంతటిదో, వారి అవతార లక్ష్యమేమిటో కొంత వరకు ఈ ప్రకటన వలన మనకు అవగతమవుతున్నది.

## ప్రేమజ్యోతి

"మీ హృదయాలలో ప్రేమజ్యోతిని వెలిగించుటకే నేను వచ్చితిని. ఏ ఒక్క ధర్మప్రచారం కోసం నేను రాలేదు. మీ ప్రేమవాహిని విశాలమై ప్రవహించవలెను. ప్రవహించకుండా నిలచిన నీరు దుర్గంధ భూయిష్టమగును. అందుచేత ప్రేమను ప్రవహించ నివ్వండి. ప్రేమయే ఆనందం, ప్రేమయే శక్తి, ప్రేమయే జ్యోతి, ఆ ప్రేమయే దైవము. నాకొక పేరు వుండాలని మీరు తలుస్తే 'ప్రేమస్వరూపుడు' అని

పిలవండి" అని పలికిన బాబా పలుకులు నిజంగా పసిడి పలుకులే. బాబా ప్రేమ కోటి తల్లుల ప్రేమతో సమానం. బాబా నిజంగా 'ప్రేమమూర్తి' 'ప్రేమజ్యోతి'ని ప్రతి హృదయంలో వెలిగించటానికి దివినుండి భువికి దిగి వచ్చిన ప్రేమమూర్తియే బాబా (బాబా పలికిన పసిడి పలుకులు, కురిపించిన ప్రేమజల్లులు, ప్రదర్శించిన దివ్యలీలలు ఎన్నో 'ప్రేమ జ్యోతి' గ్రంథంలో వివరించబడినాయి).

స్వామి తన ఉద్యమ లక్ష్యాన్ని, దృఢ సంకల్పాన్ని వివరిస్తూ "నా యీ ఉద్యమాన్ని సంకల్పాన్ని ఎట్టి పరిస్థితులలోను విడనాడను. దీనిని సాధించి తీరుతాను. గౌరవాగౌరవాలను, నిందాపనిందలను, కీర్తి అపకీర్తులను—ఈ ఉద్యమ నిర్వాహణలో ఎదుర్కొన వలసి వచ్చినా, వాటిని సమత్వదృష్టితో సహిస్తాను. నేను ఏ ప్రదేశానికి చెందినవాడను కాను. ఏ పేరుకు సంబంధించబడను, నా అన్నది నాకే లేదు. నీవే పేరుతో పిలిచినా, నా సమాధానం లభిస్తుంది. ఎక్కడికి పిలుస్తే అక్కడికి వెళ్ళుతాను. ఇది నా మొదటి ప్రతిజ్ఞ. మానవజాతి కోసమే నేను ఏది చేసినా! రానున్న సంవత్సరాలలో నా యీ వైభవాన్ని కళ్ళారా చూడ గలరు" అని స్పష్టం చేసారు. ఇటువంటి హామీని సామాన్యులెవరూ ఇవ్వలేరు. దైవాంశ సంభూతునికే అది సాధ్యమవుతోంది. నిజంగా మానవజాతిని ఉద్ధరించటానికే భగవాన్ బాబా అవతరించారు. మానవ రూపం ధరించిన మాధవుడే బాబా. మానవుణ్ణి మాధవునిగా తీర్చిదిద్దటమే సాయి అవతార విశిష్టత, ప్రత్యేకత.

## మనవి

భగవాన్ బాబా తత్వజ్ఞానమును గురించి, దివ్యశక్తిని గురించి క్లుప్తంగా వివరించటానికి ప్రయత్నించాను. అయితే అది ఒక

మహాసాగరం. ఓపికవున్న వారు దానిలో మునిగి తేలవచ్చు, తరించవచ్చు. అనుభవించిన వారికి అందుతుంది ఆనందం. అర్థం చేసుకొనిన వారికి అవుతుంది జ్ఞానోదయం, సమీపించిన వారికి లభిస్తుంది బాబా అనుగ్రహం. నమ్ముకున్నవారు పొందుతారు మోక్షం. దూరంగావుండి యదార్థమును తెలుసుకొనకుండా చౌకబారు విమర్శనలు చేసేవారు అవసాన దశలో విచారించవలసి వస్తుంది. అప్పుడు పశ్చాత్తాపబడినా ప్రయోజనం వుండదు. కనుక నా మనవి విని మనసారా మన్నించి, విజ్ఞతను ప్రదర్శించి భగవాన్ బాబావారి అనుగ్రహాన్ని పొందటానికి ప్రయత్నించండి! తరించండి!

ఓం శ్రీ సాయిరాం

కర్మ మార్గంబు విడరాని కాలిబాట
భక్తి మార్గంబు సులువైన బండిబాట
జ్ఞానమన విమానంబుపై యాన మరయ
యోగమన నింక జలధిపై యోడగాదె.

మతములన్ని చేరి మంచినే బోధించె
తెలిసి మెలగవలెను తెలివితోడ
మతులు మంచివైన మతమేమి చెడ్డది
వినుము భారతీయ వీరసుతుడు.

# సాయి గాయత్రి

" సాయీశ్వరాయ విద్మహే
సత్యదేవాయ ధీమహి ।
తన్న స్సర్వః ప్రచోదయాత్ ॥ "

" శ్రీ సత్యసాయిని సాక్షాత్ భగవంతుడని, ఈశ్వరుడని గురువు వల్ల, శాస్త్రాలవల్ల అనుభవంవల్ల తెలిసికొనుచున్నాను ".

" పరబ్రహ్మ స్వరూపుడైన ఆ సాయి పరమేశ్వరుడు మా యొక్క బుద్ధులను మంచి పనులయందు, సత్కర్మానుష్ఠానములయందు ప్రేరణ చేయునట్లు ప్రార్థించుచున్నాను ".

" ఆ సత్యసాయిమూర్తిని, సత్యస్వరూపుడు, చిత్స్వరూపుడు, సర్వజగద్వ్యాపకులు, సర్వదేవతా స్వరూపినిగా నా హృదయంలో మనః పూర్వకంగా ధ్యానించుచున్నాను ".

ఈ మంత్రద్రష్ట కీ. శే. శ్రీ ఘండికోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. వీరు విజయనగర ఆస్థాన మహావిద్వాంసులు, అభినవ విద్యారణ్య బిరుదాంకితులు, సంస్కృత కవులు, ప్రశాంతి విద్వన్మహాసభ ప్రారంభక సభ్యులు, వయోవృద్ధులు అయిన వీరు అవసాన దశలో శ్రీ సత్యసాయి ప్రభు సన్నిధిలో వున్నారు.

ది 24-12-1977 న బెంగుళూరు వైట్ ఫీల్డులోని స్వామి మందిరంలో పండితులు, అధ్యాపకులు, విద్యార్థుల సభలో శ్రీ ఘండికోట వారిని ప్రసంగించమని స్వామి ఆదేశించారు, సంధ్యారాక సమయమది. అప్పుడు శ్రీ శాస్త్రిగారి మదిలో అద్భుతమైన చైతన్య స్రవంతి ప్రవహించి బహిర్గతమైనది. అదియే ఈ అమూల్య మంత్రం (సాయి గాయత్రి). ఆనాడు శ్రీ శాస్త్రిగారు చేసిన ప్రసంగం మార్చి 1979 ఇంగ్లీషు 'సనాతన సారధి' పత్రికలో ప్రచురించబడింది. దాని సారాంశ

మను శ్రీ శాస్త్రిగారి కుమారరత్నం శ్రీ ఘండికోట వెంకట సుబ్బారావు గారు వ్రాసి పంపగా ఆగష్టు 1987 'శ్రీవాణి' మాస పత్రికలో ప్రచురించినాము. దానిని ఈ చిన్ని 'శ్రీ సాయివాణి' పుస్తకంద్వారా భక్తులకు సమర్పించుకుంటున్నాను. జపించండి! తరించండి!

ఈ సత్యసాయీ గాయత్రీ—ఇతర గాయిత్రులవలె ఒక వేద మంత్రం. ఇది చతుర్వింశతి గాయత్రీ—అంటే 24 అక్షరములతో యున్నది—మూడు పాదాలున్నవి. పాదానికి 8 అక్షరములున్నవి. దీనిలో అత్యద్భుతమైన విశేషమున్నది. మహర్షి వరరుచి సూత్రి ప్రకారం అక్షర సంఖ్య మొత్తం—109. ఈ మంత్రాన్ని 108 సార్లు జపం చేసిన తరువాత, మేరుపర్వత శిఖర సాధనకు ఆఖరి మెట్టులాగ, సంసిద్ధికి 109వ సంఖ్య గుర్తు. అది సాయి భగవానుని ప్రసాదసిద్ధికి మూలం.

ప్రతి మంత్రానికి, ఛందస్సు, ఋషి, అధిష్ఠాన దేవత యుండును. అటులనే ఈ మంత్రం గాయత్రీ ఛందస్సులో యున్నది. మంత్రద్రష్ట శ్రీ ఘంటికోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, మంత్రాధిష్ఠాన దేవత ప్రత్యక్ష భగవాన్ సత్యసాయీశ్వరుడే!

శ్రీ సత్యసాయి గాయత్రీ సారాన్ని శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు అనుష్టుప్ శ్లోకంలో వివరించి భక్తులకు సమయంలో అందించారు.

" యోదేవస్సత్య సాయీశః
బుద్ధిం ధర్మాది గోచరాం।
ప్రేరయేత్తస్య యత్తేజః
తద్వరేణ్య ముపాస్మహే॥ "

అనగా "ప్రకాశ స్వరూపులైన సత్యసాయి పరమేశ్వరులు. మా బుద్ధిని సత్య, ధర్మ, శాంతి, ప్రేమ, అహింస, త్యాగమయంగా, సర్వదా మా హృదయ కుహరంలో ఉండి మమ్ము ప్రేరేపించుగాక ! ఆ శ్రేష్ఠమైన ఆ సత్యసాయీశుని తేజస్సు కేవలం శరీరావచ్ఛిన్న శుద్ధ చైతన్యమే. దానిని మేము శ్రద్ధతో ఉపాసించుచున్నాము".

ఆ సందర్భమున శ్రీ శాస్త్రిగారు ఒక సందేహ నివారణ చేసినారు.

"సత్యసాయీ గాయత్రీ మంత్రములో మూడవ పాదములోని సర్వ శబ్దముయొక్క స్థానములో సాయి శబ్దము నున్నప్పుడే సాయి గాయత్రీ అగునని కొందరు సందేహ పడవచ్చును. కాని, అట్లు అవసరం లేదు ".

"మంత్ర మహార్ణవములో అనేక దేవతల గాయత్రులున్నవి. ఉదాహరణ : హయగ్రీవ గాయత్రి ఈ విధంగా ఉన్నది. "వాగేశ్వరాయ విద్మహే, హయగ్రీవాయ ధీమహి, తన్నో హంసః ప్రచోదయాత్" ఇందులో మూడవ పాదములో హయగ్రీవ శబ్దములేక, హంస శబ్దమున్నను, దీనికి హయగ్రీవ గాయత్రి అనియే మంత్ర మహార్ణవంలో నున్నది. కాన సాయి గాయత్రిలోని సర్వ శబ్దమున్నను, సాయి గాయత్రి అని వ్యవహరించుటయే శాస్త్ర సిద్ధమగును. ఇంకొక విషయం. ఈ సాయి గాయత్రిలోని సర్వశబ్దము పరబ్రహ్మ వాచకము ".

తైత్తిరీయ నారాయణోపనిషత్తులో "సర్వేభ్యస్సర్వ శర్వేభ్యః" అను మంత్ర వాక్యమునకు విద్యారణ్య భాష్యములో ఇట్లున్నది. 'తత్సృష్ట్వా తదేవాను ప్రవిశత్'' ఇతి శ్రుత్యా సర్వాంతర్యామి త్వేన

పరమేశ్వర సంయుక్తం సర్వ రూపత్వం—అని సర్వశబ్దమునకు సచ్చిదానంద శుద్ధ నిర్గుణ పరబ్రహ్మార్థకత్వమును వ్రాసిరి.

"కాన శ్రీ సత్యసాయి గాయత్రి శుద్ధ బ్రహ్మప్రతిపాదకమనియు శ్రీ సత్యసాయి సాక్షాత్ పరమాత్మ స్వరూపులనియు సాయి గాయత్రి యొక్క తాత్పర్యము."

ఈ మహిమాన్వితమైన సత్యసాయి గాయత్రీ ద్రష్టలైన శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు అక్షయ నామ సంవత్సర దసరామహోత్సవ ప్రారంభంలో అంటే ఆశ్వయుజ శుద్ధ పాడ్యమినాడు పరమపదించారు (1986 సం.) వీరు శతవర్షములు జీవించిన ప్రసిద్ధ వేదపండితులు.

ఈ సాయి గాయత్రీ మంత్రము ముందు 'ఓం'కారము చేర్చి జపించిన యెడల యజ్ఞము ఆచరించినంతటి ఫలము కూడా కలుగునని ఎందరో మహాపండితులు శలవిచ్చారు.



"కష్టసుఖముల నొకరీతి గాంచవలయు
కలిమిలేములు విడదీసి గడుపరాదు
కీర్తి అపకీర్తులను నొక మూర్తి గానె
భావమందుంచి మెలుగుటే భక్తిపథము"



"మానవుల కంటె మృగములే మంచివేమో
ఎంత విజ్ఞానముండియు నేమి ఫలము ?
మానవత్వము కోల్పోయి మనిషి నిలిచె
ఇంతకన్నను వేరెద్ది ఎఱుగ వలతు ?"

* అతి భాష మతిహాని; మితభాష అతిహాయి
* అనుకరణ అధోగతికి రాజబాట
* అహం పెంచుకుంటే గొయ్యి; సోఽహం పెంచుకుంటే హాయి
* ఆచరణయే అర్చన. ఆచరణ ప్రధానం, ప్రచారం కాదు
* ఆశయాల కోసం జీవించు, ఆశల కోసం కాదు
* కోపమే పాపానికి ధూమం
* కృషి వుంటే కృప వుంటుంది
* గుణం కంటె మించిన బలం లేదు
* జీవుళ్ళను బాధించి, దేవుళ్ళను పూజిస్తే ఏమి లాభం?
* దయగల హృదయమే దైవమందిరం
* దివ్య జీవితాన్ని కోరాలి, దీర్ఘ జీవితం కాదు
* నీతియే నీ జాతి, అది వదలితివా నీవు కోతివే
* భగవన్నామమే భవసాగరాన్ని దాటించే నావ
* ముక్తికి సాధనం భక్తి, భక్తికి రూపం ప్రేమ
* రాగద్వేషాలే రాహుకేతువులు
* శీలం లేని మనిషి చిల్లులకుండవంటివాడు
* సంఘ నీతియే మానవ జాతికి జ్యోతి
* సేవ ప్రేమయొక్క మనోహర పుష్పం
* హృదయము లేని మాటల కంటె, మాటలులేని హృదయమే మేలు
* ప్రార్థన అంటే ఒకరిని యాచించటం కాదు, అది ఆత్మపడే తపన
* హరికి దాసులు కండి సిరికి కాదు
* విద్యార్థులు విషయార్థులు కారాదు
* ప్రేమ కత్తిలేకుండా పరిపాలిస్తుంది; చట్టం లేకుండా బంధిస్తుంది
* సత్యం జన విరోధం, అసత్యం జనరంజకం
* పరమాత్ముని మెప్పుకై పాటుపడండి; పరుల మెప్పుకై కాదు.

* Agriculture is for living, Atma culture is for life.
* Education is for life and not for living.
* Money comes and goes, but morality comes grows.
* Service to humanity is service to divinity.
* The end of education is character.
* The end of wisdom is freedom.
* The end of knowledge is love.
* Imitation is human, creation is divine.
* Forget the good that you have done to others.
* Forget the harm that any one has done to you.
* Small minds select narrow roads.
* Education is not for mere living it is for life.
* Character is the most precious gift of education.
* Don't waste time, Time waste is life waste.
* Laziness is rust and dust; Realisation is best and rest.
* Splitting of love is Science, spirit of love is Spirituality.
* Where there is faith; There is peace
  where there is peace; There is truth
  where there is truth; There is God.
* Truth is your Father
  Love is your Mother
  Peace is your Daughter
  Wisdom is your Son
  Devotion is your Brother
  Yogis are your Friends.

# దివ్యదర్శనము

"నా దర్శనానంతరం ఏకాంత స్థలములో కూర్చుండి, ఏ చలనము లేక నా దర్శనభాగ్యము ననుభవింపుడు. అప్పుడు మీకు నా ఆశీర్వాద ఫలితము పూర్తిగా లభించును. నేను మీకు దర్శన మిచ్చుచూ, మీ ముందు వెళ్ళునప్పుడు నాలోని శక్తి కొంత మీపై ప్రసరించును. అటుల చేయక మీరు మీతోడి జనులతో కూడి మాటలలో మునిగితిరేని, మిమ్ము చేరిన నా శక్తి నిష్ఫలమై వెనుతిరిగి నన్ను చేరును. మీరు ముఖ్యముగ గమనించవలసిన విషయము ఏమన, నేను దేనిని వీక్షించినను, అది శక్తివంతమై మార్పు చెందుచుండును. అదే విధముగ మీరును దినదినము మార్పు చెందుచున్నారు. నా దర్శనము వలన మీరు పొందు లాభమును ఎప్పటికిని చులకనగా చూడకుడు. ఇది మీకు మీ పూర్వ పుణ్యము వలన లభించిన వరప్రసాదము. నా దర్శనార్థము దేవలోకములోని దేవతలు కూడా ఎంతయో ఆతురతతో వేచియుందురు. ఇంతటి దర్శన భాగ్యము మీకు సులభముగా దినదినము లభించుచున్నది. ఇది మీ జన్మాంతర పుణ్య విశేషమని మరువవద్దు. సరియైన సమయ మాసన్నమైనప్పుడు నా దర్శన భాగ్యము వలన మీకిచ్చిన నా దీవెనలు పుష్పించి ఫలించును. అయినను, ఒక విషయము మాత్రం మీరు తెలుసుకొనుడు. ఎవరికి ఎక్కువగా యివ్వ బడునో, వారినుండి ఎక్కువగా కూడాలాగబడును." —బాబా

## అవతారములు

దివ్యత్వాన్ని తెలుపుటకోసం (షిరిడీ), ఇక్కడ దివ్యత్వాన్ని అందించటంకోసం (ప్రస్తుత సత్యసాయి అవతారం), రాబోయేది దివ్యత్వాన్ని బోధించుట కోసం (ప్రేమసాయి)—అదే షిరిడీ సాయి, సత్యసాయి, ప్రేమసాయి.

— బాబా (28-9-1990)